

# చందమామ

జూలై 1984



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-00

సంవత్సర చందా: 24-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [" గుడ్డిబిచ్చగాడు "] కు ఆధారం, మాచిరాజు కామేశ్వరరావు రచన.

పరిపాలనాధికారం అనేది ఎంతో బాధ్యతతో కూడినపని. అధికారంలో వున్నవాడు ప్రజాభిప్రాయాన్నీ, సలహాదార్ల మాటనూ తోసిపుచ్చి, తన బుద్ధికితోచిన విధంగా ప్రవర్తిస్తే, ఎలాంటి కీడు కలుగుతుందో, " దొంగల బెడద " అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

సౌలభ్య లభ్య వస్తూనా, మవజ్ఞైవ న గౌరవమ్,
మలయే భిల్ల కాంతానాం, చందనం చేంధనాయతే.

[సులభంగా లభించే వస్తువుల మీద ఎవరికైనా తిరస్కారభావం తప్ప, గౌరవం వుండదు. చందనవృక్షాలు వుండే మలయపర్వతం మీది భిల్లస్త్రీలు, చందనాన్ని వంటకట్టెగా ఉపయోగిస్తారు.]

సంపుటి 75 జూలై '84 సంచిక 1
విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



## చందమామ కబుర్లు



### గుండెజబ్బులు తగ్గించే పెంపుడు జంతువులు!

కుక్క, పిల్లి, చిలుక, పావురం మొదలైన జంతువులనూ, పక్షులనూ ఇంట్లో పెంచడం వల్ల సరదాగా పొద్దుపోవడమే కాకుండా— గుండెకు, రక్తప్రసరణకూ సంబంధించిన వ్యాధులు రాకుండా కూడా వుంటాయని పరిశోధనలవల్ల వెల్లడయింది. మనిషి–జంతువుల సంబంధం గురించి స్వీడన్‌లోని గోథెన్‌బర్గ్‌లో ఇటీవల జరిగిన ఒక సదస్సులో ఈ విషయాన్ని పలువురు శాస్త్రపరిశోధకులు వెల్లడించారు.

### భూకంపాలను సూచించే జంతువులు

కొన్ని జంతువుల నడవడికను పరిశీలించడం ద్వారా రానున్న భూకంపాలను ముందుగానే పసిగట్టవచ్చు అంటున్నారు, ప్రముఖ భూకంప శాస్త్రవేత్త డాక్టర్ హెచ్. ఎన్. శ్రీవాత్సవ!

భూకంపాలను ముందుగానే తెలుసుకోడం ఎలా? అనే తన గ్రంథంలో డాక్టర్ శ్రీవాత్సవ ఈ విషయాన్ని ఎన్నో ఉదాహరణలతో వివరించారు. జపాన్‌లోని నాగోయా నగరంలో ఎలుకలు విపరీతంగా వుండేవి. అయినా అవన్నీ 1891 వ సంవత్సరం ఒక్కసారిగా మటు మాయమయ్యాయి. ఆ మరురోజే నోబీ భూకంపం వచ్చింది!





చైనాలోని టియంట్సిన్ ప్రాంతంలో 1969 వ సంవత్సరం జూలై పద్దెనిమిదో తేదీ వచ్చిన భూకంపానికి రెండు, మూడు గంటల ముందు—కోళ్ళు తమ గూళ్ళలోకి వెళ్ళడానికి మొరాయించాయి. పులులు స్తిమితాన్ని కోల్పోయాయి. గుర్రాలూ, గొర్రెలూ అటూ ఇటూ పరుగెత్తసాగాయి.

యుగోస్లేవియాలో 1955 సంవత్సరం భూకంపానికి ముందు జంతు ప్రదర్శనశాలలోని పక్షులన్నీ గీపెట్టసాగాయి. ఉత్తర ఇటలీలో 1976 వ సంవత్సరంలో వచ్చిన భూకంపానికి రెండు గంటల ముందు—జింకలన్నీ ఒకచోట గుమిగూడాయి. గ్రామాల నుంచి పిల్లులు ఎటో వెళ్ళిపోయాయి.

## మీకు తెలుసా?

1. క్రీ॥శ॥ యాభైయవ సంవత్సరంలో క్రైస్తవ మతాన్ని భారతదేశంలో ప్రవేశపెట్టిన వారెవరు?
2. 24 మంది తీర్థంకరులను తమ గురువులుగా భావించే మతం ఏదో మీకు తెలుసా?
3. క్రీ॥శ॥ 425 వ సంవత్సరం నుంచి 1205 వరకు బీహార్‌లో వెలిసిన బౌద్ధవిశ్వవిద్యాలయం పేరు ఏమిటి?
4. పారశీకుల పవిత్రగ్రంథం ఏది?
5. క్రీ॥ పూ॥ మొదటి శతాబ్దంలో రోము నగరంలో గొప్ప వక్తగా పేరు గాంచిన వారెవరు?

(సమాధానాలు 64వ పేజీలో)




వీరగుప్తుడు పాలిస్తున్న విజయపుర రాజ్యంలో అరాజకపరిస్థితులు ఏర్పడినై. ఎంత ఆలోచించినా అందుకు కారణాలు అంతుచిక్కక, చివరకు పొరుగు రాజ్యమైన చంపకదేశానికి ఒకసారి వెళ్ళి రావాలనుకున్నాడు, వీరగుప్తుడు.

చంపకదేశం సుభిక్షంగా వుంటున్నదనీ, అందుకు కారణం ఆ దేశపు రాజు ధీరసేనుడనీ అంతా చెప్పుకుంటూండేవారు. ధీరసేనుడు తన రాజ్యంలో ఏం చేస్తున్నాడో చూడడం కోసం, వీరగుప్తుడు వెళ్లి ఆయనను కలుసుకున్నాడు.

ధీరసేనుడు, ఆయనకు ఘనంగా స్వాగతం పలికి, వచ్చినపని తెలుసుకుని, "ఏ దేశం అభివృద్ధి అయినా, ఆ దేశ ప్రజల మీద ఆధారపడి వుంటుంది. నా దేశం సుభిక్షంగా వున్నదంటే, అందుకు కారణం, నా ప్రజలే!" అన్నాడు.

ఈ మాటలు విన్నాక వీరగుప్తుడికి మనసులో కొంత తృప్తి కలిగింది. తన దేశంలో అరాజకానికి కారణం తను కాదు; తన ప్రజలు. అందువల్ల, చంపక దేశ ప్రజల గొప్పతనం తెలుసుకోవాలనిపించింది, వీరగుప్తుడికి.

"దానిదేముంది! మారు వేషంలో ఇద్దరం దేశసంచారం చేద్దాం," అన్నాడు ధీరసేనుడు.

ఇద్దరూ బయలుదేరి చంపకదేశంలో చాలా ప్రాంతాలు తిరిగారు. ప్రతిచోటా ధీరసేనుడికి గొప్పగా స్వాగతమూ, ఘనంగా మర్యాదలూ జరిగినై.

ఇది చూసి వీరగుప్తుడికి చాలా ఆశ్చర్యం కలిగింది. ఆయన ఒకణ్ణి, "మీ రాజు మారువేషంలో వున్నాడు కదా, అయినా ఎలా గుర్తుపట్టగలుగుతున్నారు?" అని అడిగాడు.

"వసుంధర"



"రాజుగారిపట్ల మా హృదయాల్లో ఎనలేని భక్తి గౌరవాలున్నవి. ఆ కారణంగా, ఆయన ఏ మారువేషంలో వున్నా, మేము సునాయాసంగా గుర్తుపట్టగలం," అన్నాడు వాడు.

ఈ సమాధానం విని వీరగుప్తుడు మరింతగా ఆశ్చర్యపోయాడు.

ఈ పర్యటనలో ధీరసేనుడు కొన్నిచోట్ల తనకు నచ్చిన వస్తువులు కొనుక్కోవాలని చూశాడు. కాని వర్తకులు ఆయన వద్ద డబ్బు తీసుకోక, "మా రాజుగారికి వీటిని కానుకగా యిస్తున్నాం. రాజుకూ, ప్రజలకూ మధ్య వ్యాపారం వుండకూడదు," అన్నారు.

దేశసంచారం ముగిసిన తరవాత వీరగుప్తుడు, ధీరసేనుడితో, "నిజంగానే మీ ప్రజలు గొప్పవారు. నా ప్రజలు వారినుంచి చాలా నేర్చుకోవలసి వున్నది," అని తనదేశానికి తిరిగి వెళ్ళాడు.

ఒక నెల రోజులు గడిచాక ఆయన, తన ప్రజల తీరుతెన్నులెలా వున్నదీ తెలుసుకునేందుకు మారువేషంలో దేశసంచారం ప్రారంభించాడు. ప్రజలెవ్వరూ వీరగుప్తుణ్ణి గుర్తించలేదు. ఒకచోట ఆయన ఒక వస్తువు బేరం చేసి, వ్యాపారి మరీ ఎక్కువ ధర చెబుతున్నాడని భావించి, "నేనీ దేశపు రాజునని తెలిస్తే, యింత ధర చెబుతావా?" అన్నాడు.

ఇలా అన్న తరవాత కూడా వ్యాపారి, రాజును గుర్తుపట్టక, "మహారాజుగారికైతే యింత స్వల్పధర చెప్పను, యింకా ఎక్కువ చెబుతాను," అన్నాడు.

వీరగుప్తుడికి ఏమనేందుకూ పాలుపోలేదు. ఆయన దేశసంచారం ముగించి, నగరానికి తిరిగి వచ్చాడు. తరవాత మంత్రులను సమావేశపరిచి, వాళ్ళకు తన అనుభవాలు చెప్పి, "ఇటువంటి ప్రజలున్న దేశానికి రాజును కావడం, నా దురదృష్టం. మన ప్రజలు చంపక దేశ ప్రజల్లా మారాలంటే, ఏం చేయాలో మీరే చెప్పండి," అన్నాడు.

మంత్రులు తమలో తాము చర్చించుకుని, "ప్రభూ, రాజుగా మీరు పొరుగు దేశం వెళ్ళి వచ్చారు. ప్రజలనుంచి కూడా కొందరిని ఎన్నికచేసి, వాళ్ళను చంపక దేశంలో కొన్నాళ్ళుండి రమ్మనడం బావుంటుందని, మా అభిప్రాయం," అన్నారు.

మంత్రుల సూచన వీరగుప్తుడికి నచ్చింది. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి నూరుమంది ప్రతినిధులు ఎన్నిక చేయబడ్డారు. వాళ్ళను చంపకదేశంలో రెండు మాసాలపాటు వుండి రావలసిందిగా ఆయన ఉత్తరువు జారీ చేశాడు. ఇందుకు చంపకదేశ రాజు ధీరసేనుడి అనుమతి కూడా లభించింది.



రెండు నెలలు గడిచాక రాజు పంపిన ప్రతినిధులు తిరిగి వచ్చారు. రాజు వాళ్ళ అనుభవాల గురించి అడిగాడు.

"ఏ దేశం అభివృద్ధి పొందాలన్నా, అందుకు సరిఅయిన నాయకుడుండాలి. చంపకదేశపు రాజు ధీరసేనుడు అసమాన ప్రజ్ఞాశాలి!" అన్నారు వాళ్ళు.

వీరగుప్తుడు యీ మాటలు వింటూనే కోపం తెచ్చుకుని, "ధీరసేనుడే నాతో చెప్పాడు—తన దేశం ఏ అరాజకాలూ లేకుండా సుభిక్షంగా వున్నదంటే, అందుకు కారణం తన ప్రజలే కాని, తను కాదని!" అన్నాడు.

"ఆయన దేనికీ, తనను తాను పొగడుకోడు. ప్రజలను కన్న బిడ్డల్లా ప్రేమిస్తూ, అన్ని గొప్పతనాలూ వారికే అంటకడతాడు," అన్నారు ప్రతినిధులు.

వీరగుప్తుడు ఒకటి, రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, "ఏ వేషంలో వున్నా తమ రాజును గుర్తుపడతారు చంపకదేశ ప్రజలు. అసలు వేషంలో కూడా రాజును గుర్తుపట్టలేని ప్రజలు, మన దేశంలో చాలా మంది వున్నారు. దీనికేమంటారు ?" అన్నాడు.

"ప్రభూ, గౌతమ బుద్ధుడి బొమ్మ ఎక్కడ కనబడినా, అందరూ గుర్తుపడతారు. ఇందుకు కారణం బుద్ధుడి గొప్ప

తనమే కాని, ప్రజల గొప్పతనం కాదు గదా,'' అన్నారు ప్రతినిధులు.

ప్రతినిధులు చెప్పే మాటల్లో ఏదో అంతరార్థమున్నదని గ్రహించిన వీరగుప్తుడు, "మీరు చెప్పదలుచుకున్నదేమిటో సూటిగా చెప్పండి,'' అన్నాడు.

దానికి ప్రతినిధులు ఎంతో వినయంగా, ''ధీరసేనుడు ప్రజల గురించి తప్ప, ఇంకేమీ ఆలోచించడు. ఆయనకు విలాస జీవితం మీద ఆసక్తిలేదు. తన విలాసాల కోసం కాక, ప్రజల అవసరాలు తీర్చేందుకే పన్నులు వేస్తాడు. ఆయనకు ప్రజలపై పూర్తి విశ్వాసం వున్నది. అందువల్లనే వాళ్ళ మీద ఎటువంటి ఆంక్షలూ విధించలేదు. అటువంటి రాజు పరిపాలకుడుగా వుంటే, ఏ ప్రజలైనా అలాగే వుంటారు,'' అన్నారు.

వీరగుప్తుడికి కనువిప్పయింది. తన ప్రజలు చంపకదేశ ప్రజల్ని ఆదర్శంగా తీసుకోవాలంటే, తను రాజు ధీరసేనుణ్ణి ఆదర్శంగా తీసుకోవాలి!

''నేను ధీరసేనుణ్ణి, ఏనాడో ఆదర్శంగా తీసుకున్నాను. ఇంకా నాలో ఏ లోపం వున్నది?'' అని అడిగాడు వీరగుప్తుడు.

''మీరు అలా చేసి వుంటే, ఆయనకు మీ ప్రజలను గురించి గొప్పగా చెప్పి వుండేవారు. కాని—క్షమించాలి, మీ అసమర్థతను ప్రజలపై నెట్టివేయాలని చూశారు. అందువల్ల, చంపకదేశంలో మన ప్రజలను గురించి చాలా చెడుగా చెప్పుకుంటున్నారు,'' అన్నారు ప్రతినిధులు.

వీరగుప్తుడు వాళ్లను పంపివేసి, మంత్రులను పిలిచి, ''తప్పంతా మనది! మన ప్రజల్లో లోపాలుంటే, వాటిని సరిదిద్దవలసిన బాధ్యత మనపైన వుంటుంది. ఆ బాధ్యతను సక్రమంగా నిర్వహించడం చేతకాకపోతే నేను రాజుగానూ, మీరు మంత్రులుగానూ ఉండతగరు,'' అన్నాడు.

ఈ సత్యం తెలుసుకున్నాక, వీరగుప్తుడి పాలనలో అతడి దేశప్రజలు కూడా, క్రమంగా చందనదేశపు ప్రజలలాగే మారిపోయారు.






## 15

[ఓడ ముక్కలు చెక్కలై నీట మునగగా, పింగళుడు ఒక కొయ్యను ఆధారంగా చేసుకుని సముద్రంలో ఈదుకుపోయి ఒక ఎడారి ప్రాంతాన్ని చేరాడు. అతడికి అక్కడి నవాబుగారి సేనానాయకుడు హసన్‌గోరీ అనేవాడితో పరిచయం అయింది. ఇద్దరూ కలిసి అనుచరులతో ఎడారి దొంగలను పట్టుకునేందుకు 'ఇఫీ ఖిల్లా' అనే కోటవైపుకు బయలుదేరారు. తరవాత–]

నవాబుగారి ఒంటెల పటాలం నాయకుడైన హసన్‌గోరీ చేయి చూపినవైపుకు పింగళుడు దృష్టి సారించాడు. ఎదురుగా కనిపించుతున్నది, ఎడారిలో వున్న ఒక పురాతనమైన కోట. కోట పక్క నుంచి, చిన్న కొండవాగు ఒకటి ప్రవహిస్తున్నది. దానికి రెండు అంచుల మీదా ఎత్తయిన ఖర్జూర చెట్లు గాలి తాకిడికి తలలు ఆడిస్తున్నవి. కోట బురుజుల మీదగానీ, గోడల మీదగానీ మనుష్య సంచారమే లేదు. ''ఇదేనా, మీరనే ఇఫీఖిల్లా?'' అని అడిగాడు పింగళుడు.

''అవును, పింగళా! ఆ దూరంగా కొండలకేసి పోతున్న సన్నని రాజమార్గం నీ కంటికి కనిపించుతున్నది గదా! అదే, బిడారు వర్తకులు, టెహరాన్ నుంచి కైరోకు వెళ్ళే మార్గం. దారిలో వున్న యీ కోటప్రాంతం వారికి మజిలీగా




ఉపయోగిస్తున్నది. వారికమార్గ మధ్యంలో ఎడారిదొంగల నుంచి అపాయం కలగకుండా రక్షణ యిచ్చేందుకు, యిక్కడ యీ ఇఫీఖిల్లా కట్టబడింది. దీన్ని కాపాడేందుకు రెండు వందలమంది సైనికులు కూడా నియోగింపబడ్డారు. వారంతా ఏమయినట్టు? అంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వున్నది,'' అన్నాడు హసన్‌గోరీ.

''మనం ఖిల్లా లోపలికి వెళితే తప్ప, అక్కడ ఏమి జరిగిందీ తెలియదుగదా? బహుశా మీరు లోగడ అనుమానించినట్టు, ఆ ఎడారి దొంగ రాబందు తన అనుచరులతో, ఖిల్లా మీద దాడి చేసి, సైనికులను హతమార్చి వుంటాడు,'' అన్నాడు పింగళుడు.

''అంతే అయివుంటుంది. కాని, ఆ రాబందు అనుచరులైనా ఒక్కడూ కనిపించడే!'' అన్నాడు హసన్‌గోరీ.

పింగళుడు తను వున్న ఒంటెను ముందుకు నడుపుతూ, ''గోరీసాహెబ్! మనం యిక్కడ నిలబడి, ఆ లోపల ఏం జరిగిందో ఊహించ ప్రయత్నించటం వృథా శ్రమ. ఖిల్లా ద్వారాన్ని చేరితేగాని, ఆ ప్రాంతాల ఎంతటి భీకర సంగ్రామం జరిగిందో తెలియదు. బహుశా ఎడారి దొంగలు ఖిల్లా ముఖద్వారాన్ని కాల్చి నుసి చేసి, తరవాత లోపలకు జొరబడి, సైనికులను హతమార్చి వుంటారు,'' అన్నాడు.

''నిజం, నిజం! పెద్ద పోరు జరగందే, మా సైనికులు లొంగే రకం కాదు. బహుశా ఎడారి దొంగలు వందల సంఖ్యలో వచ్చి ఖిల్లాను ముట్టడించి వుంటారు,'' అన్నాడు హసన్‌గోరీ.

క్రమక్రమంగా పింగళుడూ, హసన్‌గోరీ ఎక్కిన ఒంటెలు, ఖిల్లా గోడవెంట కొంత దూరం నడిచి ముఖద్వారం వున్న దిక్కుకు వచ్చినై.

ఖిల్లా ముఖద్వారం అలాగే చెక్కు చెదరకుండా వున్నది. దాన్ని మామూలు

గానే లోపల వున్నవాళ్లు మూసిన విధంగా, తలుపులు రెండూ ఒకదానికొకటి బాగా అనుకుని వున్నవి.

ఎంతో ప్రశాంతంగా కనిపించే ఈ దృశ్యాన్ని చూస్తూనే హసన్‌గోరీ పొట్ట చెక్కలయేలా బిగ్గరగా నవ్వాడు. తరవాత ఒంటె మీది నుంచి ఒక్క ఉరుకున కిందికి దూకి, "పింగళా! మనం అనవసర భయాలకు లోనయ్యాం. ఎంత జిత్తులమారీ, పొగరుబోతూ అయినా, ఆ రాబందు సాహసించి మా సైన్యాలను ముఖాముఖి ఎదుర్కోవటానికి తెగించ లేదు. పోతే, యీ ఖిల్లా ప్రాంతం యింత నిర్మానుష్యంగా వుండటానికి కారణం యిప్పుడిప్పుడే నాకు అర్థమవుతున్నది," అంటూ చిరునవ్వు నవ్వాడు.

పింగళుడు, హసన్‌గోరీ కేసి ప్రశ్నార్థకంగా చూశాడు. హసన్‌గోరీ పింగళుడికి మరింత దగ్గరగా వచ్చి, "మా వాళ్ళంతా గొంతులవరకూ తాగి, ఆ కైపులో మైమరచి నిద్రపోతూండి వుంటారు!" అన్నాడు.

పింగళుడు అనంగీకారంగా తల వూపి, "అలా అనుకున్నా....ఆ ఎడారిలో వున్న సైనికుడు అక్కడ రాబందులపాల ఎలా పడినట్టు? అతడు కూడా యీ ఖిల్లా రక్షకులలో ఒకడుగదా?" అని అడిగాడు.



"ఆ పొగరుబోతు బహుశా ఖిల్లా నుంచి ఒంటరిగా బయటికి వచ్చి, తాగిన మైకంలో ఏ ఖర్జూరచెట్టు కిందనో పడుకుని వుంటే—ఆ రాబందు అతణ్ణి చేజిక్కించుకుని వుంటాడు," అన్నాడు హసన్‌గోరీ.

పింగళుడు ఓ క్షణకాలం వూరుకుని, తరవాత ఖిల్లా ద్వారం కేసి నడుస్తూ, "మీరు చెప్పినవాటిల్లో ఏ ఒకటైనా నిజం కావొచ్చు, లేక మనం ఊహించని ఏ దారుణ ప్రమాదమైనా జరిగిపోయినా పోవచ్చు. ముందు, ద్వారం తలుపులకు లోపల గడి వేసి వున్నదో లేదో చూస్తాను." అంటూ జాగ్రత్తగా వాటిని సమీపించి,



ఎత్తుగా, దృఢంగా వున్న ఆ దెవదారు చెక్కలను రెండు చేతులతోనూ బలంగా వెనక్కు తోశాడు.

తానంత బలం ఉపయోగించటం వృధా అని పింగళుడు వెంటనే గ్రహించాడు. లోపల గడి వేయబడని ఆ తలుపులు కిర్రుమని శబ్దం చేస్తూ. చేయి పట్టేంతగా వెనక్కు జరిగినై. అది చూస్తూనే పింగళుడు ఒక పెద్ద కేక పెట్టి చెంగున గోడపక్కకు పరిగెత్తాడు. మరు క్షణంలో భూమ్యాకాశాలు బద్దలయినవా అన్నంత భయంకర ధ్వనితో, తలుపుల వెనక మాటుగా దట్టించబడిన తుపాకీ మందు పేలి, తలుపు దర్వాజాలనూ, కోటగోడలోని ముందు భాగాన్నీ చెల్లా చెదురుగా గాలిలోకి ఎగరకొట్టింది.

ఆ ధ్వనీ, దానితోపాటు లేచిన మంటలూ, పొగా అక్కడ వున్న అందర్నీ నిశ్చేష్టులను చేసింది. తలుపు దర్వాజాల చెక్కలూ, కోట గోడరాళ్ళూ తగిలిన కొందరు బాధతో హాహాకారాలు చేశారు. గాయపడిన ఒంటెలు కొన్ని చెవులు చిల్లులుపడేలా అరుస్తూ, రౌతులను పడదోసి ఎడారిలో అన్ని వైపులకూ చెల్లా చెదురుగా పారిపోయినై.

ఆ ప్రదేశాన్నంతా అలుముకున్న పొగ, గాలి తాకిడికి విచ్చిపోగానే పింగళుడు, తన చుట్టూ జరిగిన బీభత్సాన్ని చూశాడు. ఒంటెల పటాలంలో కొందరు మరణించారు, కొందరు గాయపడి బాధతో మూలుగుతున్నారు. ఆ దృశ్యాన్ని చూస్తూనే కంపించిపోయిన పింగళుడు, త్వరలోనే తెప్పరిల్లి, హసన్‌గోరీ కోసం గాలించసాగాడు. అతడు అక్కడికి దాపుల్లోవున్న ఒక ఖర్జూరపు చెట్టు దగ్గిరకు గాలి తాకిడివల్ల ఎగిరి పోయి, పింగళుణ్ణి చూస్తూనే లేచి కూర్చునేందుకు ప్రయత్నించాడు.

పింగళుడు, హసన్‌గోరీని సమీపించి, తన చేతిని ఆసరాగా యిస్తూ, "పెద్ద గాయాలేమీ తగలలేదుగదా ?" అన్నాడు.

"అటువంటి ప్రమాదం ఏమీ జరగలేదు. మందు పేలినప్పుడు పుట్టిన గాలి తాకిడికి ఎగిరి యింత దూరానపడ్డాను. ఉదయం లేచిన వేళావిశేషం! ఎంతో అదృష్టవంతుణ్ణి!" అన్నాడు హసన్‌గోరీ.

"ఆ మాట మెల్లిగా అంటావేం, హసన్! తలుపులు తేలిగ్గా వెనక్కు కదిలేసరికే, ఆ వెనక ఏదో మాటు పెట్టబడి వుంటుందని నేను గ్రహించాను. అందుకే నేను పెద్దగా కేక పెట్టి ఖిల్లా గోడపక్కకు పరిగెత్తటం జరిగింది. అయినా, దురదృష్టం కొందికీ, నా హెచ్చరికతోపాటే, ఆ దట్టించబడిన తుపాకీ మందు పేలింది!" అంటూ పింగళుడు వెనుదిరిగి చూసి, "దాదాపు సర్వనాశం జరిగిపోయింది. సైనికులు మూడువంతులు మరణించి వుంటారు!" అన్నాడు.

హసన్‌గోరీ బాధగా లేచి నిలబడి, దుస్తులకు పట్టిన దుమ్మూ యిసకా దులుపుకుంటూ, "ఇది ఆ రాబందు మనను హతమార్చేందుకు వేసిన ఎత్తు. కోటలో వున్న సైనికులందరినీ తుదముట్టించిన తరవాత మనను నాశనం చేయటానికి యీ కపటోపాయం ప్రయోగించాడు. ఇక, యిప్పుడు మనం చేయవలసింది, చావగా మిగిలిన సైనికులతో, ఆ క్రూరకర్ముణ్ణి వెతికి వెంటాడి చిత్రహింసలుపెట్టి చంపటం," అన్నాడు ఎంతో ఉద్రేకంగా.




ఆ తరవాత పింగళుడూ, హసన్‌గోరీ కలిసి గాయపడిన సైనికులందరినీ ఖిల్లా గోడ నీడకు చేర్చి, వాళ్ళ గాయాలకు కట్లు కట్టేందుకు కొందరిని నియోగించి, మిగిలినవారితో ఖిల్లా లోపలకు వెళ్ళారు.

ఖిల్లాలో వారికి ఎదురైన భయంకర దృశ్యం, యిద్దరినీ స్థాణువుల్లా చేసింది. అక్కడ వున్న ప్రతి భవనం, గుడారాలతో సహా నిలువెల్లా కాల్చబడి, ఒట్టి మొండిగోడలు మాత్రం బోసిగా కనిపించినై. ఎక్కడ చూసినా చెల్లాచెదురు చేయబడిన దుస్తులూ, ఆయుధసామగ్రి



కంటబడింది. ఇక, మరణించిన సైనికుల శవాలు అడుగడుగునా ఎదురౌతున్నవి.

''పింగళా! ఒక్కగానొక్క సైనికుడైనా బ్రతికి వున్న సూచనలు లేవు. ఇక్కడ నిజంగా ఏం జరిగిందో, ఆ రాబందుకు తప్ప మరెవరికీ తెలియదు. ఇంత పెద్ద సైన్యాన్ని వాడు సర్వనాశనం చేయగలిగాడంటే, ఖిల్లాలోనే వాడికెవడో మిత్రుడొకడుండి వుండాలి,'' అన్నాడు హసన్‌గోరీ.

''కావచ్చు!'' అంటూ పింగళుడు చుట్టూ ఓసారి పరీక్షగా చూసి, ''ఇక మనం కాలం వృథాచేయటం ఎందుకు! ఆ రాబందును వెంబడిద్దామా? అతడు యీ ఎడారిలో ఎటు పోయాడో....ఆ జాడలు తెలుసుకోవటం ఎలా?'' అన్నాడు.

''అదేమంత కష్టం కాదు,'' అంటూ హసన్‌గోరీ బయటికి దారి తీశాడు. తరవాత అతడి ఆజ్ఞ కాగానే అయిదారుగురు సైనికులు ఎడారి అన్ని వైపులకూ కొంత దూరం వెళ్ళి, కొద్ది సేపట్లో తిరిగి వచ్చారు.

ఇసుకలో వున్న ఒంటెల కాలి గుర్తుల ద్వారా, ఆ సైనికులు రాబందు ముఠా ఎటు వెళ్ళినదీ, తమ నాయకుడికి చెప్పారు. హసన్‌గోరీ, పింగళుడికి రెండు మూడు క్రోసుల దూరంలో వున్న చిన్న చిన్న పర్వతాలను చూపుతూ, ''రాబందు సరాసరి ఆ కొండ గుహల ప్రాంతానికి వెళ్ళాడు. తను సాధించిన విజయానికి గర్వించి, వాడిప్పుడు బహుశా తన కాలాన్ని వేడుకలతో గడుపుతూండవచ్చు. వాడి ఊహప్రకారం. ఆ ఖిల్లా తలుపుల పక్కన వుంచిపోయిన మాటుకు మనం కూడా ఆహుతి కావలసినవాళ్ళమే గదా?'' అన్నాడు. పింగళుడు అవునన్నట్టు తల వూపాడు.

కొద్దిసేపట్లో, చావగా మిగిలిన సైనికులను వెంటవేసుకుని, హసన్‌గోరీతోపాటు, పింగళుడు కూడా ఆ పర్వత ప్రాంతాలకు బయలుదేరాడు.



ఒక గంటకాలం తరవాత వాళ్ళు ఒకా నొక పర్వత కనుమను సమీపించారు. పింగళుడు యిరుపక్కలా నిటారుగా లేచిన కొండరాళ్ళ కేసి ఓమారు చూసి, ''హసన్! మనం యిక్కడ రెండు ముఠాలుగా చీలటం మంచిదనుకుంటాను. మన వాహనాలను యిక్కడే వదిలి, యీ రాళ్ళగుట్టల్లో, కొండగుహల్లో, వాడెక్కడ దాగివున్నదీ వెతుకుదాం. కనబడితే, ఏదో సంకేతం ద్వారా ఇరువురమూ ఏకమై వాడి అంతు తేల్చుకుందాం,'' అన్నాడు.

హసన్‌గోరీ అంగీకరించాడు. పింగళుడు కొంతమంది సైనికులను వెంట తీసుకుని, కొండ రాళ్ళను ఎక్కుతూ దిగుతూ, రాబందు కోసం గాలించసాగాడు. క్రమంగా వెలుగుతగ్గి చీకటివ్యాపిస్తున్నది.

అలాంటి సమయంలో హఠాత్తుగా పింగళుడికి, తను వున్న చోటుకు దిగువగా ఏదో అలికిడీ, ఆ వెంటనే కోలాహలం వినిపించింది. పింగళుడు తన సైనికులను హెచ్చరించి, ఒక ఎత్తయిన రాతి చాటున నక్కి కిందికి చూశాడు.

సమతలంగా వున్న ఒకచోట చాలా మంది గుంపుగా చేరి పాటలు పాడుతూ, నాట్యాలు చేస్తున్నారు. వాళ్ళు ధరించిన దుస్తులూ, చేసే రణగొణధ్వనీ వింటూనే, వాళ్ళు ఎడారి దొంగలని పింగళుడు గ్రహించాడు. వెంటనే ముందనుకున్న ప్రకారం సంకేత సూచనగా, పింగళుడు కొమ్ముబూర వూదాడు.

కింద జరుగుతున్న నాట్యాలూ, పాటలూ, ఆ కోలాహలం అంతా ఒక్కసారిగా ఆగిపోయింది. తను వూదిన కొమ్ముబూర ధ్వని దొంగలు కూడా విన్నారని పింగళుడికి అర్థమైపోయింది. ఇక ఆలసించి లాభం లేదు. వెంటనే పింగళుడు ఒక పెద్ద కొండరాయిని, దిగువ వున్న దొంగల మీదికి దొర్లిస్తూ, తన సైనికులను కూడా ఆజ్ఞాపించాడు.

పింగళుడు తోసిన రాయి భూమిని తాకీ తాకకముందే 'జూఁమ్' అంటూ కొన్ని

అంబులు అతడున్న చోట రాళ్ళను తాకినై. పింగళుడు చప్పున ఒక రాతి వెనకకు తప్పుకుని, కిందికి తొంగి చూశాడు. కొందరు దొంగలు ఈటెలు చేబూని బిగ్గరగా అరుస్తూ, కొండ ఎక్కుతున్నారు. అదేసమయంలో, మరొకదిక్కు నుంచి కొన్ని బండరాళ్ళు దొర్లుతూవాళ్ళ మీద పడి, అందరినీ చెల్లాచెదురు చేసినై.

తన సంకేతం హసన్‌గోరీ అందుకున్నాడని పింగళుడు చాలా సంతోషించాడు. వెంటనే అతడు వున్న బలాన్నంతా కూడగట్టుకుని, దొంగల మీదికి కొండరాళ్ళను తోస్తూ కిందికి దిగసాగాడు. హసన్‌గోరీతో వున్న సైనికులు సింహనాదాలు చేసి, కొండరాళ్ళ మీదుగా కుప్పించి దూకుతూ, దొంగల ముఠా వున్న చోటుకు పరిగెత్తుతున్నారు.

పింగళుడు కూడా తన సైనికులను వెంటపెట్టుకుని, దొంగలు వదిలే బాణాలను తప్పుకుంటూ ముందుకు పరిగెత్తసాగాడు. రెండు ముఠాలూ కొండ దిగువనున్న సమతల ప్రదేశాన్ని చేరేసరికి, ఎక్కడి దొంగలక్కడ చెల్లాచెదురుగా పరిగెత్తారు. కాని, వెనకబడిన కొందరు దొంగలను తమ చేతగల ఈటెలతో హసన్‌గోరీ సైనికులు పొడిచి చంపారు.

"పింగళా! కమ్ముకొస్తున్న యీ చీకటిలో మనం వాళ్ళను వెన్నాడలేము. ఈ రాత్రికి యిక్కడే మజిలీ చేసి, సూర్యోదయం కాగానే వాళ్ళ అంతు తేల్చుకుందాం," అన్నాడు హసన్‌గోరీ. పింగళుడి కూడా అదే మంచి మార్గంగా తోచింది. అతడు అక్కడ బల్లపరుపుగా వున్న ఒక రాతి మీద కూర్చోబోయేంతలో, "ఎవరా, పింగళుడు? అవంతీనగర జాలరి కాదుగదా?" అన్న మాటలు ఆ కొండగుట్టల మీద ప్రతిధ్వనించినై.

"ఎవరు? పద్మపాదుడా?" అంటూ పింగళుడు ఆ ప్రశ్న వచ్చిన వైపుకు తిరిగాడు. నిలువెత్తున వున్న ఒక రాతి చాటు నుంచి పద్మపాదుడు నవ్వుతూ ముందుకు వస్తున్నాడు. —(ఇంకావుంది)






# గుడ్డి బిచ్చగాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, తలపెట్టిన కార్యం సాధించాలనే నీ పట్టుదలా, దీక్షా మెచ్చదగిందే. కాని, ప్రాప్తం లేనప్పుడు అవి గుడ్డిగవ్వకు కొరగావు. అజాగ్రత్తవల్లనో, లోకజ్ఞానం కొరవడో మనిషి తనకు లభించినవాటిని, చేజేతులా జారవిడుస్తాడు. ఇందుకు ఉదాహరణగా నీకు, ఒక గుడ్డి బిచ్చగాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ యిలా చెప్పసాగాడు:

సారథి అనే కుర్రవాడికి తల్లిదండ్రులు చిన్నతనంలోనే పోగా, తాత అతణ్ణి పెంచి పెద్ద చేశాడు. తాత మురిపెం కారణంగా వాడికి చదువు సంధ్యలేమీ అబ్బలేదు.

## బేతాళ కథలు



ఊళ్ళో అల్లరిచిల్లరగా తిరిగే పిల్లలతో కలిసి, తనకు పదహారవఏడు వచ్చే వరకూ, ఏ పనీ కూడా నేర్చుకోకుండా కాలం వెళ్ళబుచ్చాడు. అంతలో వాడి తాత మరణించడం జరిగింది.

ఆ నాటివరకూ సారధికి తిండితిప్పలకు బాధలేదు. తాత పోగానే వాడికి బతుకు సమస్య ఎదురయింది. ఊళ్లో కూలినాలి పనులక్కూడా ఎవరూ పిలవకపోయే సరికి, వాడు ఊరు వదిలి రెండు రోజుల తరవాత మరొక ఊరు చేరాడు.

అక్కడా వాడికి ఎవరూ పని యివ్వ లేదు. రోజంతా నీళ్ళతోనే కడుపు నింపుకుని, రాత్రికి ఒక ఇంటి అరుగు మీద పడుకుని నిద్రపోసాగాడు. హఠాత్తుగా ఒక రాత్రివేళ వాడికి దభీమన్నశబ్దంతో పాటు, ఎవరో మూలగడం వినిపించి నిద్రాభంగమైంది. వాడు చప్పునలేచి, వీధివారగా ఒక మనిషి పడివుండడం చూసి, చేతులు పట్టుకుని లేవనెత్తాడు. అతనొక గుడ్డి బిచ్చగాడు.

గుడ్డి బిచ్చగాడు సారధి భుజం మీద చెయ్యివేసి, "బాబూ, పొరుగూరి జాతరలో అడుక్కుని తిరిగివస్తున్నాను. నన్ను యీ వీధి చివర వున్న చింతచెట్టు దగ్గిరకు చేరవేస్తే, నీ మేలు మరవను. కాలు కాస్త బెణికినట్టుగా వున్నది," అన్నాడు.

సారధి, బిచ్చగాడికి చేయి ఆసరాగా యిచ్చి, చింతచెట్టు కిందికి తీసుకుపోయాడు. అక్కడ బిచ్చగాడు సారధిని అడిగి సంగతి తెలుసుకుని, "బాబూ, నాకు దారి చూపిస్తూ, నాతోపాటు యిక్కడే వుండిపో. దొరికినదానితో కలో గంజో తాగుదాం," అన్నాడు.

ఏ పనీ దొరకక ఆకలితో నకనకలాడి పోతున్న సారధి, అందుకు ఒప్పుకున్నాడు. ఆ రోజు నుంచీ, ముసలి బిచ్చగాడితో పాటు, వాడికీ ఆ చింతచెట్టు నీడ నివాస స్థానమైంది.

సారధి, గుడ్డి బిచ్చగాణ్ణి తీసుకుపోయి గుడి దగ్గిరా, రద్దీగా జనం తిరిగే యితర



ప్రదేశాల్లో కూర్చోబెట్టి, తాను కొంచెం పెడగా కూర్చునేవాడు. దొరికిన డబ్బులతో కడుపు నింపుకుని, యిద్దరూ రాత్రి చింతచెట్టు కింద పడుకునేవాళ్ళు.

ఒక రోజు మంచి ఎండవేళ, గుడిమెట్ల దగ్గిర కూర్చోబెట్టిన గుడ్డివాడు, తాపానికి తట్టుకోలేక నిద్రపోయాడు. ఆ సమయంలో విలువైన దుస్తులు ధరించిన, ఒక యాభైఏళ్ళ వ్యక్తి గుడ్డివాణ్ణి సమీపించి, వాడి భిక్షాపాత్రలో చిన్న మూట జారవిడిచి, వెనుదిరిగాడు.

అంత దూరంలో కూర్చుని చూస్తున్న సారధికి చాలా ఆకలిగా వున్నది. ఆ ధనికుడు పాత్రలో తినేపదార్థాలు ఏమైనా వేసి వుంటాడనుకుని వాడు మూట విప్పి చూసి ఆశ్చర్యపోయాడు. అందులో చాలా బంగారు కాసులున్నవి.

ధనికుడు ఏదో పొరబాటువల్ల, పాత్రలో వాటిని వేసి వుంటాడనుకుని, సారధి వేగంగా అతణ్ణి సమీపించి, ''మా తాత భిక్షాపాత్రలో వీటిని పొరబాటుగా పడవేశారేమో!'' అంటూ మూటను యివ్వబోయాడు.

ధనికుడు నవ్వుతూ సారధికేసి చూసి, ''నువ్వు, ఆ ముసలాడి మనవడివా? మరీ మంచిది! నాకు వ్యాపారంలో అనుకోకుండా పెద్దగా లాభం వస్తే, గుడిలో నాలుగు కొబ్బరికాయలు కొట్టడంతో సరిపెట్టుకోను. లాభంలో నూరోవంతు, ఏ పేదవాడికో దానం చేస్తాను. దానితో ఒక నిరుపేద బాగుపడినా పుణ్యమేకదా!'' అని వెళ్ళిపోయాడు.

ఆ డబ్బు మూటతో గుడ్డివాడి దగ్గిరకు తిరిగి వస్తున్న సారధికి, హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. ఆ డబ్బుతో తను పట్నం చేరి, ఏదో ఒక వ్యాపారం చేయవచ్చు. దాత ఉద్దేశం ఒక పేదవాడి బతుకు బాగుపడడం. అది తనే ఎందుక్కాకూడదు?

ఇలా అనుకుని సారధి, ఆ ఊరు వదిలి పట్నం వెళ్ళిపోయాడు. అక్కడ



కాస్త భారీ ఎత్తున కూరగాయల వ్యాపారం ప్రారంభించి, నాలుగు సంవత్సరాలలో ఒక లక్ష రూపాయిలవరకూ గడించి, మరొక వ్యాపారి కూతురు సులోచన అనే అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు.

సులోచన తెలివిగలది; అనుకూలవతి. ఆమెకు తన భర్త, ఏదో పల్లెటూరి నుంచి పట్నం వచ్చాడని తప్ప, మరే వివరాలూ తెలియవు. పెళ్ళయిన నాలుగు నెలల తర్వాత, ఇళ్ళు తిరిగి కూరగాయలు అమ్ముకునే వాడొకడు ఆమెతో, సారధిది తన ఊరేననీ, ఐదారేళ్ళ క్రితం కట్టుబట్టలతో ఊరు వదిలిపోయాడనీ చెప్పాడు. ఇది విన్న సులోచనకు చాలా ఆశ్చర్యం కలిగింది. కట్టుబట్టలతో ఇల్లొదిలిన తన భర్త, ఇంత స్వల్పకాలంలో అంత ధనం ఎలా సంపాయించకలిగాడు?

ఆ సాయంత్రం సారధి ఇంటికి రాగానే ఆమె సంగతి చెప్పి, "మీరు ప్రారంభం లోనే చాలా పెద్ద ఎత్తున వ్యాపారం సాగించారని విన్నాను. అందుకు అవసరం అయిన పెట్టుబడి, మీకెక్కడి నుంచి వచ్చింది?" అని అడిగింది.

సారధికి ఏం జవాబు చెప్పాలో తోచిందికాదు. ఏ విధంగా చూసినా తను దొంగ. ఒక ముసలి గుడ్డి బిచ్చగాడికి చెందవలసిన ధనం తను కాజేశాడు. ఈ సంగతి వింటే భార్య తనను అసహ్యించుకోదా?

భర్త మౌనం సులోచనకు మరింత ఆశ్చర్యం కలిగించింది. ఆమె ఒకటికి రెండుసార్లు ప్రశ్నించాక సారధి, "ఆ పెట్టుబడి పాపపుసొమ్ము; వివరాలడక్కు," అన్నాడు బాధగా.

"అది పాపపు సొమ్మయితే, వ్యాపారంలో మీరింత సంపాయించకలిగేవాళ్ళు కాదు. కొంచెం మీరే ఆలోచించి చూడండి?" అన్నది సులోచన.

దానితో సారధికి యింతకాలంగా తల మీద మోయలేని బరువుగా వున్న భారం దిగిపోయినట్టయింది.

అతడు ఉత్సాహంగా, "నీవన్నది నిజం! ఒకవేళ పాపమే అయినా, దానికి పరిహారం వున్నది. తాత యింకా బతికే వుంటాడు. మనింటికి తీసుకువచ్చి, సొంత తాత లాగా చూసుకుందాం," అని, జరిగినదంతా చెప్పాడు.

సులోచన చీరకొంగుతో కళ్ళద్దుకుని, "ఆ పని మీరెప్పుడో చేయవలసింది. రేపే బయలుదేరి వెళ్ళండి," అన్నది.

మర్నాడు తీరా బయలుదేరే సమయానికి, ఆ భార్యాభర్తలకు ఒక అనుమానం వచ్చింది. గుడ్డి తాత రానంటే ఏం చేయాలి.

"మరీ అంత రానంటే, ఆ తర్వాత నేనూ మీతో బయలుదేరి వస్తాను. అయినా, ఎందుకైనా మంచిది, డబ్బు కొంత వెంట తీసుకుపోండి. ఇచ్చి రావొచ్చు," అన్నది సులోచన.

సారథి నాలుగువేల రూపాయిలు తీసుకుని, దారిలో రెండుచోట్ల రేవుదాటి, మర్నాటి సాయంత్రానికి బాడుగబండి మీద తాత వుండే ఊరు చేరాడు. కాని, అక్కడ చింతచెట్టు కింద ఆ గుడ్డి బిచ్చగాడు లేడు.

అతను అక్కడ కనిపించినవాళ్ళను అడగ్గా, వాళ్ళు బిచ్చగాడు ఒక ఏడాదిగా, ఊరి చివరవున్న శివాలయం ఆవరణలో వుంటున్నట్టు చెప్పారు. సారథి అక్కడికి వెళ్ళాడు. ఆసరికి చీకటిపడుతున్నది. ధ్వజస్తంభం దగ్గిర చుట్ట కాలుస్తున్న





చప్పున మెలుకువ వచ్చింది. అంతకు ముందు ధ్వజస్తంభం దగ్గిర అతడితో మాట్లాడినవాడు దుస్తుల్లో దాచిన నాలుగు వేల రూపాయిల మూటా తీసుకుని పారి పోతున్నాడు. తగిలిన దెబ్బకు స్పృహ కోల్పోతున్న సారథి, వాణ్ణి వెంబడించలేక పోయాడు.

సూర్యోదయం అవుతూండగా సారథికి స్పృహ తెలిసింది. గుడ్డి బిచ్చగాడు పక్కనే కూర్చుని వున్నాడు. ఇంకా నలుగురైదుగురు మనుషులు చుట్టూ గుమిగూడి వున్నారు.

"తాతా, నీకోసమే వచ్చాను!" అన్నాడు సారథి తల తడివిచూసుకుంటూ.

వెంటనే గుడ్డి బిచ్చగాడు, "నువ్వు సారథివి కాదా?" అంటూ ఆశ్చర్యపోయి, "బాబూ, యిప్పుడెక్కడుంటున్నావు? ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే చుట్టూ చేరిన వాళ్ళు, వీడెవడో గుడ్డి బిచ్చగాడి బంధు వనుకుంటూ అక్కడి నుంచి వెళ్ళి పోయారు.

అప్పుడు సారథి, బిచ్చగాడికి జరిగిన దంతా చెప్పి, "తాతా, నన్ను స్వార్థ పరుడూ, దొంగ అని అసహ్యించుకోకు. నా భార్య కూడా నిన్ను తీసుకురమ్మన్నది. ఈ ముసలితనంలో, మా ఇంట నీకు

ఒకణ్ణి అడిగితే, వాడు, గుడ్డివాడు పూజారి ఇంటికి వెళ్ళాడనీ, కొద్దిసేపట్లో తిరిగి వచ్చి మంటపంలో పడుకుంటాడనీ చెప్పాడు.

సారథి పూజారి ఇంటికి వెళదామను కున్నాడు. కాని, రోజంతా మబ్బులు పట్టి వున్న ఆకాశం భయంకరంగా ఉరుముతూ పెద్ద వర్షం ప్రారంభమై, అంతటా చీకటి కమ్ముకున్నది. సారథి చేసేదిలేక మంటపంలోకిపోయి, ఒక మూలగా కూర్చున్నాడు. అయితే, ప్రయాణ బడలి కతో వెంటనే అతడికి నిద్రపట్టింది.

కొంతసేపటి తరవాత అతడికి తల మీద బలంగా కర్రదెబ్బ తగలడంతో

సుఖంగా జరిగిపోతుంది,'' అని, ఒక క్షణం ఆగి, ''ఆ దొంగ ఎవడో గాని, నీకోసం అని తెచ్చిన డబ్బుతోపాటు, తిరుగుప్రయాణానికని అందులో దాచినది కూడా ఎత్తుకుపోయాడు,'' అన్నాడు.



గుడ్డి తాత, సారథి తల నిమురుతూ, ''ఇంకా నయం! ఆ దొంగ నీ తల పగిలేంత గట్టిగా కొట్టలేదు. పెద్ద బొప్పి మాత్రం కట్టింది. ఒక మాట: మనిషికి రాసిపెట్టలేనిది, ఎంత ప్రయత్నించినా ప్రాప్తం కాదు. ఆ రోజు నా పాత్రలో ఎవడో ధనికుడు వేసిన డబ్బు, నాకు రాసిపెట్టలేదు కనకే, నీకు ప్రాప్తించి, దానితో నువ్వింత వాడివయ్యావు. నువ్వు నా కోసం తెచ్చిన డబ్బు, నాకు ప్రాప్తం లేదు కనకే, మరొకడిపరం అయింది. సరే, నేను రానంటున్నందుకు ఏమీ అనుకోకు. మిగిలివున్న కొద్ది కాలాన్నీ యిక్కడే గడిపేయదలిచాను,'' అన్నాడు నెమ్మదిగా.

సారథి ఎంతో దిగులుగా, ''తాతా, యీ సంగతి నా భార్యకు చెబితే, ఆమే స్వయంగా నీకోసం బయలుదేరి వస్తుంది. నా మాట కాదనకు!'' అన్నాడు.

గుడ్డివాడు కొద్దిసేపు ఆలోచిస్తూ వూరుకుని, ''అయితే, ఒక పని చెయ్యి. నేను, నువ్వు తెచ్చిన డబ్బంతా తీసుకోవడమే కాక, లోగడ జరిగినదానికి నిన్ను దొంగగా నానా మాటలూ అన్నానని ఆమెతో చెప్పు. దానితో నీ భార్యకు, నా మీద అసహ్యం కలుగుతుంది. ఇది, నువ్వు నాకు చేయగల ఒకే ఒక ఉపకారం!'' అన్నాడు.

ఆ జవాబుతో గుడ్డివాడు తన వెంట రాడనీ, ఇంకా బతిమాలి ప్రయోజనం లేదనీ, సారథి గ్రహించాడు. అతడి మనసు విలవిల్లాడింది.

సారథి, గుడ్డివాడి రెండు చేతులూ పట్టుకుని, ''సరే, నీ యిష్టం, తాతా! ఉన్నంతలో ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. మళ్ళీ ఒకసారి వచ్చి కనబడతాను,'' అని బయలుదేరాడు.

అతడలా రెండడుగులు వేయగానే గుడ్డి బిచ్చగాడు అతణ్ణి పిలిచి, "తెచ్చిన డబ్బంతా దొంగపాలయింది. ప్రయాణం ఖర్చులమాటేమిటి? ఎవర్నీ యాచించ వలసిన పనిలేదు. ఇది దగ్గిర వుంచు!" అని ఒక చిన్న సంచీ అతడి చేతికిచ్చాడు.

ఆ సంచీలో పది రూపాయిలూ, కొంత చిల్లరా వున్నది. సారథి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. తను లక్షాధికారి అయినా, పరిస్థితులు అనుకూలించక, ఒక గుడ్డి బిచ్చగాడి నుంచి దానం పట్టవలసి వచ్చింది. అతడు బిచ్చగాడికి మనసులోనే కృతజ్ఞత చెప్పుకుని, అక్కడినుంచి బయలుదేరాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, సారథి కోరినట్టు గుడ్డి బిచ్చగాడు అతడి వెంట వెళ్ళివుంటే, ముసలితనం ఏ చీకూ చింతా లేకుండా హాయిగా గడిచిపోయేది. కాని, వాడు వెళ్ళ నిరాకరించాడు. అందుక్కారణం వాడికి సుఖపడే రాతా, ప్రాప్తం లేకపోవడమా లేక మరేదైనా కారణమా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇక్కడ రాతా, ప్రాప్తం అన్నవాటికి ఆస్కారమే లేదు. గుడ్డి బిచ్చగాడు సారథిని నమ్మించేందుకు, ఆ పదాలు వాడాడు. అసలు వాడి మనస్సులో వున్నదేమిటంటే— తాను పుట్టు గుడ్డివాడే కాక, దురదృష్టవంతుణ్ణన్న నమ్మకం. అందువల్లనే తనకు దక్కవలసిన డబ్బుతో, సారథి దూరంగాపోయి, ధనవంతుడై సుఖపడుతున్నాడు. అతడు తనకోసం అని తెచ్చిన డబ్బు దొంగ ఎత్తుకుపోయాడు. ఈ కారణాలవల్ల తను సారథి ఇంటికి వెళ్ళడం అంటే, తన దురదృష్టంలో, అతడికూ్కడా పాలుపంచడమవుతుంది! ఇలా ఆలోచించే వాడు సారథి కోర్కె నిరాకరించడం జరిగింది." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# పిరికివాడు

మాళవరాజ్యంలోని ఒక జమీందారీ గ్రామంలో, పోలయ్య అనే యువకు డొకడుండేవాడు. వాడి తల్లిదండ్రులు చిన్నతనంలోనే పోగా, నాయనమ్మ వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసింది. వాడు పిరికి తనానికి పెట్టింది పేరు. తన నీడను చూసి తానే భయపడేంత పిరికివాడు.

ఒకనాడు వాళ్ళ ఇంటికి రాత్రివేళ భిక్షకోసం సన్యాసి ఒకడు వచ్చాడు. వాడి నాయనమ్మకు సన్యాసులన్నా, బైరాగులన్నా చాలా భక్తి. ఆమె. సన్యాసికి విస్తరివేసి అన్నం వడ్డిస్తున్నది. పోలయ్య గోడకు చేరగిలబడి కూర్చుని సన్యాసి కేసి వింతగా చూస్తున్నాడు. ఆ సమయంలో ఎలుక ఒకటి గెంతుతూ వంట గదిలోంచి బయిటికి వచ్చింది. దాన్ని చూస్తూనే సన్యాసికి ఎడంగా కూర్చున్న పిల్లి, మ్యావ్ అంటూ అరిచి వీధిలోకి పారిపోయింది.

ఇది చూసి సన్యాసికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. అతను నాయనమ్మను ఏదో అడగబోతున్నంతలో, ఆమె పోలయ్యతో, ''ఒరే, ఇంట్లో ఎలుకలబాధ చూసి పిల్లిని తెచ్చావు. బాగానే వుంది. అది ఎలుక కనబడగానే మీద దూకి చంపడం పోయి, వీధిలోకి పారిపోయింది. నువ్వేకాదు, నీ చేయి తగిలిన ఏ ప్రాణి అయినా, యిలా నీకన్న పిరికిదైపోయేలా వున్నది!'' అన్నది కోపంగా.

సన్యాసి సంగతి గ్రహించాడు. అతడు భోజనం అయ్యాక, పోలయ్యను దగ్గిరకు పిలిచి, అతడి ముఖ కవళికలకేసి పరీక్షగా చూసి, ఏవో లెక్కలు గుణించుకుని చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

మర్నాటి ఉదయం అతడు బయలుదేరి పోతూ, పోలయ్య నాయనమ్మను పక్కకు పిలిచి, ''నీ మనవడిది చాలా

యన్. శివనాగేశ్వరరావు



వింత జాతకం: వాణ్ణి పిరికివాడంటూ చీటికీ, మాటికీ కోప్పడకు,'' అన్నాడు.

''అయ్యా, నన్నేం చేయమంటారు! వాడి పిరికితనం పోయేందుకు మందేమైనా వుంటే యివ్వండి,'' అన్నది పోలయ్య నాయనమ్మ దీనంగా.

సన్యాసి ఒక క్షణం ఆలోచించి, ''వాడి పిరికితనం మందుమాకులతో కుదిరేది కాదు. చెప్పాగా, వాడిది వింతజాతకం అని! వాడు ఏదో ఒకనాడు పరిస్థితుల ప్రభావం వల్ల, తనకు తెలియకుండానే, పదిమందికీ మేలుకలిగించే ఘనకార్యం చేస్తాడు. ఆనాటితో వాడికి పిరికిపిశాచం పీడ విరగడైపోతుంది,'' అన్నాడు.

ఇది జరిగిన తరవాత ఒకనాడు పోలయ్య, జమీందారుగారి భవనం కేసి వెళ్ళాడు. అక్కడ వాడికి జమీందారుగారి పెంపుడు కుక్కపిల్ల కనిపించింది. ముచ్చటపడి వాడు దాన్ని దగ్గిరకు తీసుకున్నాడు. జమీందారది చూసి, వాణ్ణి గట్టిగా తిట్టి పంపాడు.

ఆ రాత్రి జమీందారింట్లో దొంగలు పడ్డారు. వాళ్ళను చూసి మొరిగి గొడవ చేయవలసిన కుక్కపిల్ల, గొలుసు గుంజుకుని దూరంగా పారిపోయింది. పిరికి పోలయ్య తన కుక్కపిల్లకు ఏదో మందు పెట్టాడనీ, అందువల్లనే అది దొంగలను చూసి పారిపోయిందనీ, జమీందారుకు అనుమానం కలిగింది.

ఆయన, పోలయ్య నేరస్థుడంటూ, వాణ్ణి పట్టుకుని న్యాయాధికారి దగ్గిరకు తీసుకుపోయాడు. న్యాయాధికారి జమీందారు చెప్పినదంతా విని, పోలయ్యకు రామాయణ గ్రంథం యిచ్చి, అంతా సత్యమే చెబుతానని ప్రమాణం చెయ్యమన్నాడు.

పోలయ్య అలాగే ప్రమాణం చేసి, గ్రంథాన్ని న్యాయాధికారికి తిరిగి యిచ్చే సమయంలో, వాడి చెయ్యి న్యాయాధికారి చేతికి తగిలింది. అంతే! న్యాయాధికారిలో పిరికితనం ప్రవేశించింది.

ఈ న్యాయాధికారి ఎంతటి దుష్టులనైనా, ఘరానా దొంగలనైనా శిక్షించడానికి ఏ మాత్రం భయపడడని ఎంతగానో పేరు మోసినవాడు. అలాంటివాడు పిరికి పోలయ్య చేయి తగిలేసరికి, కంగారుపడిపోతూ, "నేను వాదిప్రతివాదుల్లో ఎవరికి అనుకూలంగా తీర్పు చెప్పినా, రెండవ వాళ్ళకు నా మీద కోపం రావడం ఖాయం. ఆ కోపంలో వాళ్లు, నాకేదైనాహాని కలిగించవచ్చు. అందువల్ల, నేనీ వ్యాజ్యంలో తీర్పంటూ యివ్వనే యివ్వను," అంటూ న్యాయపీఠం వదిలి పారిపోయాడు.

ఇది చూసి జమీందారుకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఆయన పోలయ్యను గురించి ఆరాతీయగా, అనేక వింత విషయాలు బయటపడినై.

జమీందారుకు రాజుగారి ప్రధానమంత్రి సుగుణవర్మతో మంచి పరిచయం వున్నది. ఆయన రాజధానికి పోయి పిరికి పోలయ్యను గురించిన వివరాలన్నీ మంత్రికి చెప్పాడు. పెంపుడు పిల్లి, ఎలుకలను చూసి పారిపోవడం, జమీందారు వేటకుక్క జాతిపిల్ల దొంగలను చూసి మొరగకపోవడం—న్యాయాధికారి వింత ప్రవర్తనా, యివన్నీ తరచిచూడగా, సుగుణవర్మకు పోలయ్య చేతి స్పర్శలో ఏదో ప్రభావం వున్నదన్న నమ్మకం కలిగింది. ఆయన పోలయ్యను రాజధానికి పంపమని జమీందారుకు చెప్పాడు.





పిరికి పోలయ్య మంత్రిని చూడబోయిన సమయంలో, ఆస్థానమల్లుడు ఆయనతో మాట్లాడుతున్నాడు. మంత్రి, మల్లుణ్ణి పోలయ్యకు పరిచయం చేశాడు. పోలయ్య వినయంగా మల్లుడికి నమస్కరించి, కరచాలనం చేశాడు. అంతే! మల్లుడు చేయిలాక్కుని, అక్కణ్ణించి పారిపోసాగాడు.

మంత్రి భటులకు, ఆస్థానమల్లుణ్ణి పట్టి తన దగ్గిరకు తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. వాళ్ళు, వాణ్ణి పట్టుకురాగానే, "ఎందుకు అలా పారిపోతున్నావు?" అని అడిగాడు.

"అయ్యా, అదేం నన్నడక్కండి! నాకెందుకో భయంగా వుంది," అంటూ ఆస్థానమల్లుడు, యీసారి మరింత వేగంగా పరుగుతీశాడు. మంత్రికి పోలయ్య రహస్యం పూర్తిగా అర్థమై పోయింది.

ఆయన అప్పటికప్పుడే వెళ్ళి, రాజుకు జరిగినదంతా చెప్పాడు. రాజుకు అంతా అయోమయంగా తోచింది. ఆయన మంత్రితో, "వాడెవడో శాపగ్రస్తుడై వుంటాడు! వాడి స్పర్శతో దేశంలోని వాళ్ళంతా పిరికివాళ్ళు కాకముందే, వాణ్ణి ఉరితీయించు," అన్నాడు కోపంగా.

"మహారాజా, ఆ పిరికివాణ్ణి ఉరితీయించేందుకు, నాకు కొంచెం వ్యవధి యివ్వండి!" అని మంత్రి రాజుకు చెప్పి, పోలయ్యకు అన్ని సౌకర్యాలూ వున్న ఒక అందమైన భవంతిలో విడిది ఏర్పాటు చేశాడు.

ఒక నెల గడిచింది. హఠాత్తుగా కళింగ రాజు విక్రమసేనుడు మాళవరాజ్యం మీద యుద్ధం ప్రకటించాడు. మాళవ చిన్న రాజ్యం. బలవంతుడైన విక్రమసేనుడితో యుద్ధం చేయగలశక్తి, సైన్యం దానికి లేదు.

విక్రమసేనుడు సైన్యంతో మాళవరాజ్య సరిహద్దుల్లో శిబిరాలు నిర్మించినట్టు మంత్రి సుగుణవర్మకు వార్త అందింది. ఆయన బాగా ఆలోచించి ఒక లేఖ రాసి, దాన్ని పోలయ్యకు యిస్తూ, "ఈ లేఖను

స్వయంగా నువ్వు, విక్రమసేన రాజుకు అందించాలి!'' అని హెచ్చరించాడు.

ఇద్దరు భటులు వెంటరాగా పోలయ్య, విక్రమసేనుడి శిబిరానికి పోయి, మంత్రి యిచ్చిన లేఖను ఆయనకు అందించాడు. విక్రమసేనుడు దాన్ని ఏదో సంధి రాయబారంగా భావించి విప్పి చదివాడు. దాని నిండా పరుషవాక్యాలతో కూడిన దూషణలూ, తిట్లూ వున్నవి.

విక్రమసేనుడు పట్టరాని కోపంతో, పోలయ్య కేసి కళ్ళెర్రచేసి, ''ఈ పొగరుబోతు తల నరకండి!'' అని సైనికుడొకడికి ఆజ్ఞయిచ్చాడు.

అది వింటూనే పోలయ్య నిలువెల్లా వణికిపోతూ, ''మహాప్రభో, ఆ లేఖలో ఏమున్నదో నాకు తెలియదు. మంత్రిగారు యివ్వమని చెబితే, మీకిచ్చాను,'' అంటూ రాజు విక్రమసేనుడి కాళ్ళు రెండూ పట్టుకున్నాడు.

మహావీరుడైన విక్రమసేనుడు, ఆ క్షణం వరకూ పిరికితనమంటే ఏమిటో ఎరగడు. అటువంటిది, పిరికి పోలయ్య చేతుల స్పర్శ తగలగానే, ఆయన గడగడ వణికిపోతూ, ''మనం తెలియక దాడి వచ్చాం. మాళవరాజును జయించడం అసంభవం! పారిపోదాం, శిబిరాలు ఎత్తెయ్యండి!'' అని సైనికులను ఆజ్ఞాపించాడు.

క్షణాల మీద విక్రమసేనుడూ, ఆయన సైనికులూ తమనెవరో బలవంతుడైన శత్రువు వెంటబడి తరుముతున్నట్టు, అక్కడి నుంచి పారిపోసాగారు.

ఈ విధంగా పిరికి పోలయ్య, తనకు తెలియకుండానే, మాళవరాజ్యాన్ని ఎంతో జననష్టమూ, ధననష్టమూ నుంచి కాపాడడం ద్వారా, గొప్ప ఘనకార్యం చేశాడు. దానితో వాడికి తన స్పర్శ ద్వారా ఇతరులను పిరికివాళ్ళను చేసే శక్తి పోయింది. అంతేకాక, తరవాత వాడు మాళవరాజ్య సైన్యంలో చేరి, అనేక యుద్ధాల్లో ధైర్యంగా పోరాడి, వీరుడూ, శూరుడూ అన్న కీర్తిగడించాడు.





# పితృద్రోహి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో బోధిసత్వుడు ఒక రైతు ఇంట జన్మించాడు. అతడిని తల్లిదండ్రులు చాలా గారాబంగా చూసుకునేవారు. వాళ్ళు అతనికి కమలుడు అని పేరు పెట్టారు.

కమలుడు చిన్నతనం నుంచి కూడా వయసుకు మించిన తెలివితేటలు కనబరుస్తూ వచ్చాడు. తలిదండ్రులు తనను ఎంత గారాబంగా చూసినా, అతనికి తన తాత మీద ఎక్కువ మక్కువగా ఉండేది.

ఈ తాత చాలా ముసలివాడు. ఏ పనీ చేయలేడు. ఆయనకే మిగిలినవాళ్ళు ఉపచారాలు చేయవలసి ఉండేది. ఇది కమలుడి తల్లికి బాధగా ఉండేది. ముసలివాడు ఎప్పుడు పోతాడా అని ఎదురు ఎంతోకాలం చూసింది. కాని ఆయన మాత్రం చావలేదు.

ఒక రోజామె తన భర్తతో, "మీ నాయనతో నాకు ప్రాణం విసిగిపోతున్నది. మిగిలిన చాకిరీ ఒక ఎత్తూ, ఆయన సేవ ఒక ఎత్తూగా వుంది," అన్నది.

"పెద్దవాడైపోయాడు. ఇంకెంత కాలం బతుకుతాడులే!" అన్నాడు రైతు.

"ఎంతమందికి చావు వచ్చినా ఆయనకుమటుకు రాదు. ఈ జన్మకిక నేను సుఖపడేదిలేదు," అన్నది రైతు భార్య.

"ఆయువున్నన్నాళ్ళు బతకనీ? యేం చేస్తాం? చేతులారా చంపుకుంటామా?" అన్నాడు రైతు.

"ఏం చంపితే? బతికి ఆయనకు సుఖమా, మనకు సుఖమా? ముసలి ప్రాణాని కెంత కావాలి?" అన్నది భార్య విసుగ్గా.

రైతుకు తండ్రిని చేతులారా చంపటమంటే మొదట్లో చాలా ఘోరంగా కన

బడింది. కాని పెళ్ళాం చాలా రోజులు పోరిన మీదట, అందులో ఏమంత తప్పు లేదనిపించింది.

చివరకు రైతు తన తండ్రిని యెవరికీ తెలియకుండా చంపి మాయం చెయ్యటానికి ఒక ఉపాయం ఆలోచించాడు. ఆయన తన తండ్రి దగ్గిరికి వెళ్ళి, "నాన్నా, పొరుగూళ్ళో అప్పు మాట్లాడాను. వాళ్ళు నువు రాకపోతే ఇవ్వమన్నారు. ఓపిక చేసుకుని బండి మీద బయలుదేరు," అన్నాడు.

ముసలివాడు నిజమే ననుకుని బయలుదేరాడు. తాతను విడిచి ఒక్క క్షణం ఉండని కమలుడు కూడా ఎవరు చెప్పినా వినక, తాతతోపాటే బండి ఎక్కి కూచున్నాడు.

తప్పేది లేక రైతు తన తండ్రినీ, కొడుకునూ వెంట పెట్టుకుని బండి తోలుతూ బయలుదేరాడు. వాళ్ళు వెళ్ళే దారిలో ఒక చిన్న అడివి ఉంది. రైతు అడివి మధ్య బండీ ఆపి, "ఇప్పుడే వస్తా!" అంటూ బండి జల్లలో ఉన్న పార ఒకటి తీసుకుని చెట్ల మధ్యకు వెళ్ళాడు.

కమలుడు తాతతో, "ఇప్పుడే వస్తా!" అని చెప్పి మరొక పార తీసుకుని తండ్రి వెనకే చప్పుడు కాకుండా వెళ్ళాడు.



కొంత దూరం వెళ్ళాక తండ్రి ఒక పొద పక్క గొయ్యి తవ్వుతూ కమలుడికి కనిపించాడు. కమలుడు అదే పొద అవతలివైపు చేరి అక్కడ తాను కూడా ఒక గొయ్యి తవ్వ నారంభించాడు.

ఆ చప్పుడు విని రైతు తన పని ఆపి, పొద అవతలికి వెళ్ళి, కొడుకును చూసి ఆశ్చర్యపోతూ, "ఎందుకక్కడ గొయ్యి తవ్వుతున్నావు?" అని అడిగాడు.

కమలుడు తండ్రిని చూసి, "నువ్వెందుకు తవ్వుతున్నావో అందుకే," అన్నాడు.

"నే నెందుకు తవ్వుతున్నానో నీకు తెలుసునా?" అని అడిగాడు రైతు.

''నాకు తెలీదు. ఎందుకు తవ్వుతున్నావు?'' అన్నాడు కమలుడు.

''నా తండ్రిని పూడ్చటానికి గొయ్యి తవ్వుతున్నాను! ఆయన చస్తే పాతి పెట్టాలిసిన విధి నాకున్నది. ఎందుకంటే, నేనాయన కొడుకును,'' అన్నాడు రైతు.

''ఆయన ఇంకా బతికే ఉన్నాడుగా?'' అన్నాడు కమలుడు.

''ప్రాణంశాశ్వతమా?'' అన్నాడురైతు.

''నా తండ్రి చస్తే పాతెయ్యవలసిన విధి నాకూ ఉన్నది. నీ ప్రాణం మాత్రం శాశ్వతమా?'' అన్నాడు కమలుడు.

రైతుకు తల కొట్టేసినట్టయింది. తన కొడుకు ఈ మాట అన్నదాకా, తాను ఎంత నీచమైన పని చేస్తున్నదీ రైతుకు తెలిసి రాలేదు. ఆయన సిగ్గుపడి, పార తీసుకుని, ''పోదాం పద!'' అన్నాడు. కమలుడు కూడా తవ్వటం మానేసి తండ్రి వెంట వచ్చేశాడు.

రైతు బండిని వెనక్కు మళ్ళించి ఇంటికి తిరిగి వచ్చాడు.

ఈ లోపల కమలుడి తల్లి, మామ చచ్చిపోయినట్టే భావించి, ఆనందం కొద్దీ పిండివంటలు చేసి భర్తకోసం, కొడుకు కోసం ఎదురు చూస్తున్నది.

తిరిగి వచ్చిన బండిలో మామ ఉండటం చూసి ఆవిడకు చాలా ఆశా భంగమయింది. రైతు తన భార్యతో జరిగినదంతా చెప్పాడు. కమలుడు చేసిన పని తలుచుకుని రైతు భార్యకు గుండె చితికినట్టయింది.

''వాణ్ణి ఎంత ప్రేమగా పెంచుతున్నాం! తండ్రికే గొయ్యి తవ్వుతాడా? ఇక వాడి ముఖంచూసేదెట్లా?'' అన్నదావిడభర్తతో.

''నా తండ్రి నన్ను గారాబంగా పెంచలేదా? నేను చేద్దామనుకున్నదేమిటి? మన కొడుక్కు మన మీద అపేక్ష లేక కాదు. మనకు గుణపాఠం నేర్పటానికి అట్లా చేశాడు! ఇకనైనా వాణ్ణి చూసి బుద్ధికలిగి ఉందాం!'' అన్నాడు రైతు.

తరవాత కమలుడి తండ్రిగాని, తల్లిగాని ఎటువంటి నీచకార్యానికీ పూనుకోలేదు.



Free entry stamp in every box
of camel art material.

Turn over for more labels
and timetable.

NAME ____________________

SCHOOL ____________________ CLASS ____________________

| DAY | 1ST PERIOD | 2ND PERIOD | 3RD PERIOD | 4TH PERIOD | INTERVAL | 5TH PERIOD | 6TH PERIOD | 7TH PERIOD | 8TH PERIOD |
|---|---|---|---|---|---|---|---|---|---|
| MON | | | | | | | | | |
| TUE | | | | | | | | | |
| WED | | | | | | | | | |
| THU | | | | | | | | | |
| FRI | | | | | | | | | |
| SAT | | | | | | | | | |





## సిపాయిల తిరుగుబాటు

కొత్త ప్రాంతాలను జయించడానికి, ఈస్టిండియా కంపెనీకి పెద్ద సైన్యం, కావలసి వచ్చింది. భారతీయులను క్రమంగా తమ సైన్యంలో చేర్చుకో సాగింది. కాని, భారతీయ సిపాయిలకు, బ్రిటిష్ సిపాయిలకన్న జీతభత్యాలు తక్కువ. అంగ్లేయసైనికుడుగుర్రంమీద స్వారీ చేస్తూంటే, భారతీయ సిపాయి, అతడిసాధన సామగ్రిని మోసుకుంటూ పోవలసి వుండేది.

అంగ్లేయులు సైనికులకు కొత్త తుపాకులు సరఫరా చేశారు. అ తుపాకుల తూటాలకు జంతువుల కొవ్వు పూసేవారు. అ తూటాలను సైనికులు నోటితో కొరికి ఉపయోగించవలసి వుండేది. తమ మతవిశ్వాసాలను కించపరచాలన్న ఉద్దేశంతోనే బ్రిటిష్‌వాళ్ళు తూటాలకు జంతువుల కొవ్వు పూశారని, సైన్యంలోని హిందూ, ముస్లిం సైనికులు మథనపడ సాగారు.





దాని ఫలితంగా 1857వ సంవత్సరం మే పదో తారీఖున మీరట్‌లోని సైనికులు బ్రిటిష్ అధికారులపై తిరుగుబాటు జరిపి వారిని ఖైదీలుగా పట్టుకున్నారు.



భారతీయ సైనికులు అమితోత్సాహంతో, ఢిల్లీ కేసి పయనమయ్యారు. దారిలో కొందరు సైనికులు అక్కడక్కడా వున్న సైనిక శిబిరాలలో ప్రవేశించి, తమ తిరుగుబాటు గురించి తెలియజేశారు. సైనికులందరిలోనూ, అసంతృప్తి, ఆవేదన నెలకొని వుండడం వల్ల, సిపాయిల తిరుగుబాటు కారుచిచ్చులా విజృంభించింది.

భారతీయ సైనికులు సుప్రసిద్ధమైన ఎర్రకోటను పట్టుకుని, మొగల్ వంశం వాడైన బహద్దూర్ షాను చక్రవర్తిగా ప్రకటించారు. ఢిల్లీలోని బ్రిటిష్ సైన్యం ఓడిపోయింది. ఢిల్లీ తిరుగుబాటుదారుల హస్తగత మయింది.





బిత్తూరులో, రెండవ పీష్వా బాజీరావు దత్త పుత్రుడైన నానాసాహెబును, పీష్వా వారసుడుగా, బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించలేదు. కాని అచంచలమైన ధైర్యసాహసాలుగల సేనా నాయకుడైన తాంతియాతోపే, నానాసాహెబును పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. నానాసాహెబు, తాంతియాతోపే, సిపాయిల తిరుగుబాటుతో చేతులు కలిపారు.

ఝాన్సీరాణి లక్ష్మీబాయి, కొడుకును దత్తత తీసుకున్నా, ఆమె రాజ్యాన్ని వారసులు లేని రాజ్యంగా ప్రకటించి, దాన్ని ఆక్రమించడానికి బ్రిటిష్ వాళ్ళు తమ సైన్యాన్ని దించారు. లక్ష్మీబాయి స్వయంగా తన సేనలకు నాయకత్వం వహించి, ధైర్యసాహసాలతో పోరాడి, బ్రిటిష్ సైన్యాన్ని ఓడించి, సేనాధిపతులను బందీలుగా పట్టుకున్నది.





పట్టుబడిన సైనికులను ఆమె గౌరవంగా చూసింది. "మిమ్మల్ని మా అతిథులుగా చూసుకుంటాము. అయితే, మా ఆచార వ్యవహారాలను కించపరచే అధికారం మీ నేతలకు లేదని, వారికి మీరు తెలియజెయ్యాలి," అని బ్రిటిష్ సైనికులను హెచ్చరించింది. కాని, హఠాత్తుగా, సమర్థుడుగా పేరు గాంచిన సర్ హగ్‌రోజ్ నాయకత్వంలో బ్రిటిష్ సైన్యం ఝాన్సీ రాజ్యాన్ని చుట్టుముట్టింది.

లక్ష్మీబాయి సైనికుడిలా నిలబడి, అపూర్వమైన ధైర్యంతో పోరాడి కోటను రక్షించుకోగల్గింది. కాని, ఆ తర్వాత అధిక సంఖ్యలో వున్న బ్రిటిష్ సైన్యం, వారి దగ్గర వున్న ఆధునిక ఆయుధాల ధాటికి తట్టుకోలేక పోయింది. అఖరికి తన దత్త కుమారుడైన శిశువును సురక్షితంగా తీసుకుని అక్కడినుంచి తప్పించుకున్నది లక్ష్మీబాయి.





నానాసాహెబు, తాంతియాతోపే, ఝూన్సీ రాణిని కలుసుకున్నారు. వాళ్ళు సైన్యాన్ని సమీకరించుకుని గ్వాలియర్ మీదికి దాడి జరిపారు. బ్రిటిష్ పక్షం వహించిన గ్వాలియర్ సింధియా, కోటను వదిలి పారిపోయాడు. గ్వాలియర్ సైన్యం లక్ష్మిబాయి సైన్యంతో కలిసి, అక్కడి బ్రిటిష్ సేనలను సమూలంగా నాశనం చేసింది.

వెనువెంటనే సర్ హగ్ రోజ్ పెద్ద సైన్యంతో గ్వాలియర్ చేరాడు. రెండు సార్లు భయంకర యుద్ధాలు జరిగాక, ఝూన్సీరాణి అక్కడినుంచి తప్పించుకోవలసి వచ్చింది. బ్రిటిష్ సైనికులు ఆమెను వెన్నంటారు. దారి అటకాయించారు. ఆఖరికి వాళ్లు ఆమెనుగాయపరచ గలిగారు తప్ప పట్టుకోలేక పోయారు.





గాయపడిన ఝూన్సీరాణి తన ఉద్యాన వనం చేరి 1858 వ సంవత్సరం జూన్ 17 న ప్రాణాలు వదిలింది. ఆమె మరణ వార్త తెలిసి, బ్రిటిష్ సేనలు అక్కడికి చేరక ముందే, రాణిగారి మిత్రులు, పరిచారికలు ఆమె భౌతిక కాయాన్ని దహనం చేశారు. ప్రపంచ చరిత్రలో ఝూన్సీ రాణి లక్ష్మిబాయి మరువలేని వీరవనితగా నిలిచి పోయింది!



# దొంగల బెడద

పుళిందరాజ్యంలోని పెద్ద నగరాలలో ఒకటైన ప్రశాంతగిరికి, పురంధరు డనే అతడు రాజప్రతినిధి. అతడు సమర్థుడైన పాలకుడుగా రాజుగారి ప్రశంసలు పొందినవాడు.

ఒకనాడు పురంధరుడు తన సలహాదార్లతో నగర వ్యవహారాల గురించి మాట్లాడుతూండగా, కొందరు పౌరులు అతడి దగ్గిరకు వచ్చి, "నగరంలో పట్టపగలే దొంగలు విచ్చలవిడిగా తిరుగుతున్నారు; ఇక చీకటిపడితే చెప్పనవసరమే లేదు. తమరు వాళ్ళ బారి నుంచి పౌరులను కాపాడేందుకు తగిన రక్షణఏర్పాట్లు చేయాలి," అని విన్నవించుకున్నారు.

పురంధరుడు పౌరులు చెప్పింది వింటూనే చిరుకోపంగా, "నేనీ నగర పాలకుడుగా రాకముందు యిక్కడ ఎలాంటి అరాజక పరిస్థితులుండేవో, మీరెరుగుదురుకదా ? కొత్త జనం రావడంతో నగర పరిసరాలు పెరుగుతున్నవి. ఇంత మహానగరంలో, ఏ మారుమూలనో అడపాదడపా దొంగతనమో, దోపిడీయో జరగడం విపరీతమేం కాదు. మీరు గోరంతను, కొండంతగా చేసి మాట్లాడుతున్నారు," అన్నాడు.

"అది కాదు, ప్రభూ! పట్టపగలే దుష్టులు ప్రజల నుంచి బలవంతంగా ధనం లాక్కుపోతున్నారు. దుకాణాల దోపిడీ కూడా జరుగుతున్నది. ఇక రాత్రి వేళ కన్నపుదొంగతనాల్లాంటివి సర్వసాధారణం," అన్నారు పౌరులు.

ఈసారి పురంధరుడు బాగా కోపం తెచ్చుకుని, "ఇది నమ్మరాని సంగతి! నా విరోధులెవరో రాజుగారికి, నా మీద దురభిప్రాయం కలిగించేందుకు చేస్తున్న కుట్ర!" అన్నాడు.

కమలిని



రాజప్రతినిధికి అంతగా కోపం రావడం చూసి పౌరులు అక్కడి నుంచి చల్లగా జారుకున్నారు. అప్పుడు పురంధరుడి సలహాదార్లలో ఒకడైన నాగవర్మ అతడితో, ''మీరు కొంచెం శాంతంగా ఆలోచించాలి. వీళ్ళు కుట్రదారులైతే, మీతో ముఖాముఖి యిలా మాట్లాడరు. నగరంలో అంతా సవ్యంగా వున్నదన్న భ్రాంతిలో మనం వున్నామేమో అన్న అనుమానం కలుగుతున్నది. లోగడ శాంతి భద్రతలు స్థాపించడంలో మనం సాధించిన విజయం, బహుశా యిప్పటి మన ఉదాసీనతకు కారణం అయివుంటుంది. విచారించి తగు చర్యలు తీసుకుందాం,'' అన్నాడు.

పురంధరుడు ఒక క్షణం ఆలోచిస్తూ పూరుకుని, ''నేను, నా సమర్థతలో పూర్తివిశ్వాసం వున్నవాణ్ణి. భ్రాంతీ, అపోహల్లాంటి వాటికి అసలు తలవంచను,'' అన్నాడు.

నాగవర్మ మరి మాట్లాడలేదు.

వారం రోజుల తర్వాత ఒక రాత్రి పురంధరుడు, నగరంలోని ధనికవర్తకుడైన ఉపగుప్తుడి ఇంటికి విందుభోజనానికి వెళ్ళవలసి వచ్చింది. విందు పూర్తయేసరికి రాత్రిలో రెండుజాములు గడిచాయి. భుక్తాయాసంతో వున్న పురంధరుడికి, వీధుల వెంట నెమ్మదిగా నడుస్తూ ఇల్లు చేరడం బావుంటుందన్న ఆలోచన వచ్చింది. అందువల్ల, రాత్రివేళ నగర పరిస్థితులెలా వున్నాయో కూడా స్వయంగా గమనించ వచ్చు.

ఈ ఆలోచన రాగానే పురంధరుడు తన వెంట వున్న పల్లకీబోయీలను పంపించివేశాడు.

సలహాదారుడు నాగవర్మా, ప్రధాన సేవకుడూ వెంట రాగా, అతడు నగర వీధుల్లో నడవసాగాడు.

ఒకచోట హఠాత్తుగా నలుగురు ముసుగు మనుషులు వచ్చి, పురంధరుడి మీద కలియబడ్డారు. పురంధరుడు వాళ్ళను ఎదిరించి క్షణంలో తరిమి

కొట్టాడు. కాని, వెంటనే అతడికి తన మెడలో వుండవలసిన విలువైన రత్న హారం లేదని తెలిసింది.

అతడు, సలహాదారునూ, ప్రధాన సేవ కుణ్ణీ హెచ్చరించి, దొంగలు పారిపోయిన దిక్కుగా పరిగెత్తసాగాడు. ఒక వీధి మలుపులో పురంధరుడికి పడిగా నడిచి వస్తున్న ఒక మనిషి కనిపించాడు. అతడి మెడలో రత్నహారం ఒకటి మెరుస్తున్నది. పురంధరుణ్ణీ దూరంగా పరిగెత్తివస్తున్న అతడి పరివారాన్నీ చూస్తూనే, ఆ మనిషి గడగడ వణికిపోతూ నిలబడ్డాడు.

పురంధరుడు అతణ్ణి సమీపించి గద్దిస్తూ, "ముందు ఆ రత్నహారం యిలా యివ్వు!" అన్నాడు.

ఆ మనిషి హడలిపోయి హారాన్ని పురంధరుడి చేతిలో పెట్టి, వెనుదిరిగి పారిపోయాడు.

ఆ సమయంలో వెనుకనుంచి అక్కడికి పరిగెత్తుకు వచ్చిన పురంధరుడి ప్రధాన సేవకుడు "అయ్యా, న్యాయాన్ని కాపాడ వలసిన తమరే, ఈ విధంగా ఎవరిదో రత్నహారాన్ని బెదిరించి లాక్కోవడం వింతగా వుంది! ఈ సంగతి నగరంలో నలుగురికీ తెలిస్తే, అలజడి తప్పదు గదా!" అన్నాడు.

పురంధరుడు, సేవకుడి మాటలకు ఆశ్చర్యపోతూ, "అదృష్టవశాత్తూ మనం వెతుకుతున్న దొంగ, ఈ సందు గొందుల్లో దారితప్పి మనకేసే వస్తున్నాడు. వాడి



నుంచి నా హారాన్ని తీసుకోవడంలో అన్యాయమేముంది ?'' అన్నాడు.

సేవకుడు వినయంగా, ''అయ్యా, తమరీ వేళ విందుకు హారం ధరించి రాలేదు. హారంలోని నాలుగు రత్నాలు జారిపోతే, దాన్ని స్వర్ణకారుడికి యిచ్చి రమ్మని నా చేతనే పంపించారు,'' అన్నాడు.

పురంధరుడు గతుక్కుమని, ''అయితే, హారం ధరించినవాడు, నే నడగ్గానే దాన్ని నా చేతిలో పెట్టి పారిపోవడానికి కారణం ఏమిటి ?'' అన్నాడు.

సలహాదారు నాగవర్మ చిన్నగా నవ్వి, ''రత్నహారం ధరించి ఎక్కడికో పోతున్న పెద్దమనిషిని మీరు దొంగ అని భ్రమించారు. అతడూ యింత రాత్రి వేళ మనలను చూసి దొంగలని అపోహ పడ్డాడు,'' అన్నాడు.

''అంతే అయుండాలి మరి!'' అంటూ పురంధరుడు, ఆ మనిషి పరిగెత్తిన దిక్కు కేసి తలతిప్పాడు.

''అతడీ పాటికి ఇల్లుచేరి వుంటాడు. కాని ఒకటి; మిమ్మల్ని దోచుకోడానికి దొంగలు చేసిన, యీ ఒక్క ప్రయత్నమే, మీకు మీ వస్తువేదో పోయిందనీ, చుట్టూ వున్న వాళ్ళంతా దొంగలేననీ భ్రాంతి కలిగించింది. దొంగల బెడద ఊహించుకున్నాక, మీలాంటి వారి మనోవైఖరే యిలా వుంటే, యిక సామాన్యుల మాట ఏమిటి ?'' అన్నాడు నాగవర్మ.

పురంధరుడు, నాగవర్మ చెప్పినదంతా మౌనంగా విన్నాడు. నగరంలో శాంతి భద్రతలు సవ్యంగానే వున్నాయన్న భ్రాంతి అతడిలో పూర్తిగా తొలిగిపోయింది. మర్నాడు ఆయన నగరంలో చాటింపు వేయించి, రత్నహారాన్ని దాని యజమానికి అందేలా చేశాడు.

ఆ తరవాత పురంధరుడు నగరవాసులకు దొంగల బెడద లేకుండా చేయడానికి చాలా కట్టుదిట్టమైన ఏర్పాట్లుచేసి, అచిర కాలంలోనే సమర్థుడైన రాజప్రతినిధి అనిపించుకున్నాడు.





# పాపపరిహారం!

ఆనందుడికి ఆరేళ్ళవయసు. వాడికి చిలిపిపనులు చేయడం అంటే చాలా సరదా. ఆ చిలిపితనాన్ని తోటి వయసు వాళ్ళ మీద చూపిస్తే కొంతలో కొంత నయం; కాని, వాడు దాన్ని మూగజీవాల మీద ప్రదర్శించేవాడు.

ఇలాటి ఆనందుడి పాలబడింది, ఒక చిన్న కుక్కపిల్ల. అది బక్కచిక్కి చాలా బలహీనంగా వుండేది. వీధుల్లో తిరుగుతూ తిండికోసం మిగతా కుక్కపిల్లలతో పోటీ పడలేకపోయేది. అది చూసి జాలిపడి, ఆనందుడి తండ్రి దానికి రోజూ రెండు పూటలా తిండిపెట్టేవాడు. ఆ సమయంలోనే ఆనందుడు తన చిలిపిపనులు ప్రారంభించేవాడు.

వాడు కుక్కపిల్ల ముందున్న అన్నం గిన్నెను తీసుకుని ఎత్తున వుంచేవాడు. అది ఆకలితో కుయ్యోమొర్రో అని మొరిగేది. కాసేపు దానినలా మొరగనిచ్చి, అప్పుడు గిన్నెను దానిముందు పెట్టేవాడు. ఆమాత్రానికే కుక్కపిల్ల విశ్వాసంతో తోకాడిస్తూ వాడిచుట్టూ తిరిగేది.

ఒక్కొక్కసారి ఆనందుడు కుక్కపిల్లను దొడ్లోకి తీసుకుపోయి, ఏ చెట్టు కొమ్మ మీదనో పెట్టేవాడు. అది భయంతో వణికిపోతూ అరుస్తూంటే, సంతోషంగా చప్పట్లు కొట్టేవాడు.

ఆనందుడి తండ్రి వాణ్ణి యిది తప్పని మందలిస్తూండేవాడు. అయినా వాడు కుక్కపిల్లను హింసపెట్టడం మానేవాడు కాదు.

క్రమంగా ఆనందుడు పెరిగి పెద్దవాడయ్యాడు. వాడికి చదువు సరిగా అబ్బలేదు. ఊళ్ళో కొన్నేళ్ళుగా అతివృష్టి, అనావృష్టి కారణంగా పంటలు సరిగా పండడం లేదు. అందువల్ల ఆనందుడు

జొన్నలగడ్డ రామలక్ష్మి



పొట్ట చేతబట్టుకుని పట్నం చేరుకున్నాడు. అక్కడ ఒక శ్రీమంతుడి ఇంట్లో వాడు పనివాడుగా చేరాడు. ఆయన వాడికి రెండు పూటలా భోజనం పెట్టి, నెలకు పాతిక వరహాలు యిచ్చేవాడు. ఈ శ్రీమంతుడు గొప్ప ధర్మగుణం కలవాడని పేరు. పని వాళ్ళకు అంత పెద్ద జీతం యిచ్చేవాళ్ళు, అక్కడ మరొకరు లేరు.

శ్రీమంతుడికి శేఖరుడనే పదేళ్ళ కొడుకున్నాడు. వాడికి ఆనందుడంటే చాలా యిష్టం. వాడు అస్తమానూ ఆనందుడి చుట్టూ తిరుగుతూ కథలు చెప్పమని వేధిస్తూండేవాడు. ఆనందుడు చేసే పని మాని వాడికి కథలు చెప్పి—పని మధ్యలో ఆపినందుకు శ్రీమంతుడిచేత బాగా తిట్లుతినేవాడు.

ఇలా కొంతకాలం జరిగాక శ్రీమంతుడు ఒకనాడు ఆనందుణ్ణి పిలిచి, "నువ్వు పని శ్రద్ధగా చెయ్యడం లేదు. ఇలా అయితే నువ్వు నౌకరీ మానుకోవలసి వస్తుంది," అన్నాడు.

అప్పుడు ఆనందుడు అసలు కారణం శ్రీమంతుడికి చెప్పాడు. శ్రీమంతుడు శేఖరుణ్ణి గట్టిగా కోప్పడ్డాడు. దీనితో శేఖరుడికి ఆనందుడి మీద బాగా కోపం వచ్చింది. అప్పటి నుంచీ వాడు ఆనందుణ్ణి పని చేసేటప్పుడు పలకరించడం మాని, వాడు అలిసిపోయి సేద తీర్చుకునేందుకు కూర్చున్నప్పుడు, ఏవో చిలిపిపనులు చేస్తూ వాణ్ణి నానా బాధలు పెట్టేవాడు.

ఒకనాడు ఎముకలు కొరికే చలిలో శేఖరుడు కొత్తబట్టలతో ఆనందుడి దగ్గిరకు వెళ్ళి, "ఈ బట్టలు చలిని బాగా ఆపుతాయి. నీ పాతబట్టలు విప్పేస్తే, ఇవి యిస్తాను," అన్నాడు.

ఆ మాట నమ్మి ఆనందుడు తన బట్టలు విప్పి అవతలపెట్టి, ఒక చిన్న అంగవస్త్రం చుట్టుకుని నిలబడ్డాడు. శ్రీమంతుడి ఇంట ఒక వేటకుక్క వున్నది. శేఖరుడు దాన్ని ఈలవేసి దగ్గిరకు పిలిచి,

ఆనందుడితో, "వెంటనే పారిపో. లేక పోతే యిది నీ కండలు పీకేస్తుంది!" అన్నాడు.



ఆనందుడు భయంతో ఇంట్లో నుంచి బయిటికి పరిగెత్తాడు. వేటకుక్క వాడి వెంటపడింది. ఇలా చలిలో రెండు, మూడు నిమిషాలపాటు ఆనందుడు కుక్కకు దొరక్కుండా అటూ, ఇటూ పరుగులు తీశాక, శేఖరుడు దాన్ని వెనక్కు పిలిచి, తాను వెంట తెచ్చిన కొత్త బట్టలను వాడికిచ్చి, "పాపం, చాలా అలిసిపోయావు. వీటిని కట్టుకో," అన్నాడు హేళనగా నవ్వుతూ.

శేఖరుడు యిచ్చిన బట్టలు నీళ్ళలో తడిసి చల్లగా వున్నవి. ఆ రాత్రి ఆనందుడికి సరిగా నిద్రపట్టలేదు. మర్నాడు వాడు శేఖరుడిపై ఫిర్యాదు చేద్దామని శ్రీమంతుడి దగ్గిరకు వెళ్ళాడు.

ఆ సమయంలో మరొక నౌకరు శేఖరుడి ఆగడాల గురించి శ్రీమంతుడికి చెపుతున్నాడు. ఆయన అంతా విని, "శేఖరుడు నీకు పనిలో అడ్డువస్తే, నేను సహించను. కాని, మిగతా సమయాల్లో వాడేం చేసినా, నువ్వు భరించవలసిందే. ప్రతిదానికీ వాడి మీద తంపులు చెబితే, నేను ఊరుకోను. ఇక వెళ్ళు!" అన్నాడు కోపంగా.

ఈ మాటలు విన్న ఆనందుడు, యజమానితో ఏమీచెప్పకుండానే వెళ్ళిపోయాడు.

శ్రీమంతుడి వద్ద ఎందరో పనివాళ్ళున్నప్పటికీ, శేఖరుడు ఆనందుణ్ణే ఎక్కువగా బాధిస్తూండేవాడు. ఇది చూసి మిగతా వాళ్ళు జాలిపడ్డారు. వాళ్ళల్లో ఒకడు బాగా ఆలోచించి, ఎక్కడినుంచో ఒక కుక్కపిల్లను తెచ్చి శేఖరుడికిచ్చాడు.

తనతోటి నౌకరు చేసిన ఈ పనికి ఆనందుడు ఆశ్చర్యపడి, వాణ్ణి యిలా ఎందుకు చేశావని అడిగాడు.

"ఇప్పుడు శేఖరుడికి ఆడుకునేందుకు కుక్కపిల్ల దొరికింది. ఇక నీ జోలికి రాడు," అన్నాడు వాడు.



పిల్లను బెదరకొడుతున్నాడు. అది వణు కుతూ కుయ్యోమంటున్నది.

ఆనందుడు, శేఖరుడితో, "నీకు సరదా అయితే నీ ఇష్టప్రకారం నన్ను హింసించు. అంతేకాని కుక్కపిల్లను వదిలిపెట్టు!" అన్నాడు కోపంగా.

"నేను వదలను. అవతలికిపో!" అన్నాడు శేఖరుడు విసురుగా.

"వదలమని చెపుతున్నాను. వదులు తావా, లేదా?" అంటూ ఆనందుడు, శేఖ రుడి చేయి పట్టుకున్నాడు.

"వదలకపోతే, ఏం చేస్తావు?" అన్నాడు శేఖరుడు.

ఆనందుడు, శేఖరుడి చెంప మీద గట్టిగా కొట్టి, కుక్కపిల్లను తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు. శేఖరుడు ఏడుస్తూ తండ్రివద్దకు వెళ్ళి, జరిగింది చెప్పాడు. ఒక పనివాడు తన కొడుకును కొట్టడమా అని శ్రీమంతుడు మండిపడి, వెంటనే మనిషిని పంపి ఆనందుణ్ణి రప్పించి సంజాయిషీ అడిగాడు.

"అయ్యా, ఆ కుక్కపిల్ల, మీ అబ్బాయి దగ్గిర నానా బాధలూ పడుతున్నది. దానిని రక్షించి పెంచుకోదలిచాను," అన్నాడు ఆనందుడు నిర్భయంగా.

శ్రీమంతుడు వాడి ధైర్యానికి ఆశ్చర్య పడి, "నా కొడుకు ముచ్చటపడిన కుక్క

ఆ జవాబుతో ఆనందుడికి తన చిన్న నాటి సంగతులు గుర్తుకు వచ్చినై. తను కుక్కపిల్లను బాధలు పెట్టడం వల్లనే, ఆ పాపఫలం యిప్పుడనుభవిస్తున్నాను అనుకున్నాడు. శేఖరుడు మనుషుల్నే బాధపెడుతున్నప్పుడు, కుక్కపిల్లను మరింతగా బాధలు పెడతాడు. తను కష్టపడినా పరవాలేదు గాని, ఆ కుక్క పిల్లను ఎలాగైనా బాధల బారినుంచి రక్షించి, తన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి!

ఇలా అనుకుని ఆనందుడు, శేఖరుడి దగ్గిరకు వెళ్ళాడు. అప్పుడు శేఖరుడు వేటకుక్కను ఉసికొల్పుతూ, కుక్క

పిల్లే, నీకూ ఎందుకు కావలసివచ్చింది?'' అని అడిగాడు.

ఆనందుడు తన కథ అంతా చెప్పుకుని, ''చిన్నతనంలో నేను చేసిన పాపానికి పరిహారంగా, ఈ కుక్కపిల్లను కాపాడి, నా చిన్నతమ్ముడంత ప్రేమగా సాకాలనుకుంటున్నాను. అప్పుడే నా బతుకు కూడా బాగవుతుందని, నా నమ్మకం,'' అన్నాడు.

శ్రీమంతుడు వెంటనే ఆనందుడికి వందవరహాలు బహుమానంగా యిచ్చి, ''ఆ కుక్కపిల్లను, నీ దగ్గిరే వుంచుకో. ఇకమీదట శేఖరుడివల్ల, నీ కేమైనా యిబ్బందులు కలిగితే నాకు చెబుతూ వుండు,'' అన్నాడు.

ఇది తెలిసి శ్రీమంతుడి భార్య, ''మీరు, మన శేఖరుణ్ణి పనివాడికి లోకువ చేశారు,'' అని ఎంతో బాధపడింది.

శ్రీమంతుడు ఆమెతో, ''వెర్రిదానా, చిన్నతనంలో కుక్కపిల్లను బాధపెట్టి, ఆనందుడు ఆ పాపఫలం అనుభవిస్తున్నాడనేది, వాడి నమ్మకమే కాదు, నా నమ్మకం కూడా! అంటే, మనవాడు కూడా కుక్కపిల్లను బాధలు పెడితే, పెద్దవాడయ్యాక, వాడిదీ ఆనందుడి వంటి బతుకే అవుతుంది. మనవాడిని అలాంటి పాపం నుంచి రక్షించినందుకు, నేను వాడికి బహుమతి యిచ్చాను!'' అని వివరించి చెప్పాడు.

కుక్కపిల్లను పెంచుకోనడం మొదలు పెట్టాక, ఆనందుడికి అదృష్టం కలిసి వచ్చింది. పట్నంలోని ఒక చిన్న వ్యాపారస్థుడు, ఆనందుడి ప్రవర్తన గురించి విని చాలా సంతోషించి, శ్రీమంతుడి అనుమతితో, వాణ్ణి తన ఇంటికి తీసుకుపోయాడు. ఆయనకు పెళ్ళీడుకొచ్చిన ఒక కూతురున్నది. ఆ అమ్మాయి ఆనందుడితో తన వివాహానికి యిష్టపడడంతో, వర్తకుడు సంతోషంగా ఆ ఇద్దరికీ వివాహం జరిపించాడు.

ఆ తర్వాత ఆనందుడికి జీవితంలో ఏనాడూ కష్టాలంటూ దాపురించలేదు.





# పచ్చిమోసం

బిలుసుపాడులో బాపనయ్య అనే వర్తకుడున్నాడు. ఆ ఊళ్ళోనే రామయ్య అనే ఆసామీ వుంటున్నాడు. రామయ్యకు కుటుంబ అవసరాలకు ఒక పాతిక రూపాయలు కావలసి వచ్చింది. ఎవరినైనా అడుగుదామంటే తనను నమ్మి ఊళ్ళోవాళ్ళెవరూ దమ్మిడీ కూడా ఇవ్వరని రామయ్యకు తెలుసు. రామయ్య ఎప్పుడూ బాపనయ్యను అడిగి వుండలేదు. అందుచేత వడ్డీ ఆశ చూపి మెల్లగా బాపనయ్య దగ్గర డబ్బు లాగాలనుకున్నాడు.

"బాపనయ్య బాబూ! ప్రాణం మీదికి వచ్చింది. మళ్ళీ ఈ వారం నాటికి పువ్వుల్లో పెట్టి నీవు కోరిన వడ్డీతో నీ చేతులో పెడతా. ఒక్క పాతిక రూపాయలు ఇద్దూ!" అని ప్రాధేయపూర్వకంగా అడిగాడు రామయ్య.

బాపనయ్య సామాన్యంగా చెయిజారే మనిషి కాదు. ఇంకెవరికన్నా ఐతే ఇచ్చేవాడేమో గాని, రామయ్యకు ఇస్తే వడ్డీ మాట అలా వుంచి అసలు గల్లంతు అవుతుందని బాపనయ్యకు అపనమ్మకం. అందువల్ల నాలుగు తియ్యటి మాటలు చెప్పి రామయ్యను సాగనంపుదామనుకున్నాడు.

"రామయ్యా! ఎన్నడూ అడగనివాడివి నోరు తెరిచి అడిగావు. ఏం చేసేది? సొమ్మంతా వ్యాపారంలో బిగిసిపోయింది. లేకపోతే, నీ కిస్తే యెక్కడికి పోతుంది. లేదన్నానని మరేమీ అనుకోకేం!" అని అతి వినయంగా చెప్పాడు బాపనయ్య.

బాపనయ్య ఎంత వినయంగా చెప్పినా తనకు ఇవ్వడానికి ఇష్టం లేకనే ఇలా నాటకం ఆడాడని గ్రహించాడు, రామయ్య. "సరే! ఇంకొక చోట చూస్తాలే,"

అని వెళ్ళిపోయాడు. కాని బాపనయ్య దగ్గర నుంచి ఏ విధంగానైనా డబ్బు రాబట్టాలని రామయ్య నిశ్చయించుకొన్నాడు. కూర్చున్నా, నుంచున్నా దీనిని గురించే ఆలోచించడం ఆరంభించాడు. ఆఖరికి అతనికి ఏదో ఆలోచన వచ్చినట్టు చరచరా బాపనయ్య కొట్టు దగ్గరకు వెళ్ళాడు.

కొట్లో బాపనయ్య ఒక్కడే కూర్చొని వున్నాడు. ఇదే సమయమని రామయ్య బాపనయ్యను సమీపించి, ''ఇదుగో, బాపనయ్యా! ఐదు పదు లెంత?'' అని ప్రశ్నించాడు. రామయ్య లెక్క తెలియక అడుగుతున్నా డనుకొని ''యాభై కదటయ్యా!'' అన్నాడు బాపనయ్య.

''బాగుంది నీ తెలివి! అరవైకదూ?'' అన్నాడు రామయ్య తీవ్రంగా. ''భలే వాడివిలే, యాభై,'' అన్నాడు బాపనయ్య. ''ఏయ్! జాగ్రత్తగా మాట్లాడు, అరవై!'' అన్నాడు పెద్దగా కేకలు పెడుతూ రామయ్య. ''యాభై!'' అన్నాడు బాపనయ్య అంతకంటె పెద్దగా.

ఈ విధంగా బాపనయ్యా, రామయ్య యాభై, అరవై అని కేకలు పెట్టుకోవడం విని చుట్టుపక్కల వాళ్ళంతా బాపనయ్య కొట్టు దగ్గిరకు వచ్చి, ''ఏమిటయ్యా, మీ అరుపులు?'' అని ప్రశ్నించారు.

''చూడండి! ఈ పెద్ద మనిషి, నన్ను మోసంచేయడానికి చూస్తున్నాడు. నేను ఇతని దగ్గర అరవై రూపాయలు దాచు



కున్నాను. తీరా అవసర మొచ్చి ఇప్పుడు అడిగితే, యాభయ్యే నంటున్నాడు.'' అన్నాడు రామయ్య. నిజంగా సొమ్ము పోయినవాడిలా.

బాపనయ్య దిగ్భ్రాంతి చెందాడు. ''అరి పిడుగా! నా దగ్గర నువ్వు డబ్బు దాచావా? ఎంత అన్యాయం! ఎంత అన్యాయం! అంతా ఒట్టిదే బాబూ!'' అని జరిగిన విషయం పెద్ద మనుషులకు చెప్పబోయాడు బాపనయ్య. రామయ్య అతడి మాటను చొరనివ్వలేదు. ''ఇదుగో, బాపనయ్యా! నీ నాటకం ఇక కట్టిపెట్టు. ఇందాకటి నుంచీ యాభై అని ఇప్పుడు అసలే లేదంటున్నావా? ఆ పది రూపాయలు తింటే తిన్నావు గాని నువ్వన్న ఆ యాభై రూపాయలు నా మొహాన పారెయ్! జన్మలో ఇంకెవరి దగ్గరా డబ్బు దాచిపెట్టకుండా బుద్ధి చెప్పావు. ఈ పది రూపాయలతోనే బాగుపడిపోవులే, కానియ్!'' అన్నాడు రామయ్య ఎంతో చాకచక్యంగా. అక్కడ చేరిన వాళ్ళందరూ రామయ్య మాటలు నమ్మేశారు. వాళ్ళు నిజంగా రామయ్య బాపనయ్య దగ్గర డబ్బు దాచాడనుకున్నారు.

''బాపనయ్యా! వాడు అరవై రూపాయలు దాచుకుంటే యాభయ్యేనంటివి. నువ్వు అన్నప్రకారం ఆ యాభయ్యే ఇవ్వమంటున్నాడు గదా? మొత్తం కైంకర్యం చెయ్యాలంటే ఎట్లా చెప్పు! దేనికైనా న్యాయం ఉండొద్దూ! మర్యాదగా యాభై రూపాయలు ఇచ్చి పంపెయ్!'' అని తీర్పు చెప్పారు అక్కడ చేరినవాళ్లంతా.

ఇంకాస్సేపు ఆగితే అరవై రూపాయలు ఇవ్వమని తీర్పు చెప్తారేమోనని పాపం, బాపనయ్య కిక్కురుమనకుండా యాభై రూపాయలు రామయ్య దోసిట్లో పోశాడు.

చూశావా! నా తెలివి అన్నట్టు చూస్తూ రామయ్య చక్కాపోయాడు.

పాతిక రూపాయలు అప్పు ఇవ్వనందుకు బూటకం చేసి రెట్టింపు తీసుకుపోయాడని బావురుమన్నాడు పాపం, బాపనయ్య!






# విష్ణుకథ

కృష్ణుడు రథాన్ని రణరంగం మధ్యలో నిలిపాడు.

అర్జునుడు యుద్ధసన్నద్ధులైన తాతలను, తండ్రులను, గురువులను, బంధుమిత్రులను చూసి చింతాక్రాంతుడై రథం దిగి, ధనుస్సును, తూణీరాలను నేలను పడవేసి చతికలబడుతూ, ''రాజ్యమూ వద్దు, యుద్ధమూ వద్దు, ఎవ్వరినీ ఎదుర్కోలేను, ఎవ్వరి చావునూ చూడలేను!'' అన్నాడు.

అప్పుడు కృష్ణుడు చిరుదరహాసం చేసి, అతని ముందుకు వచ్చి, ''అర్జునా! యుద్ధరంగానికి వచ్చి, అవివేకంలోపడి ఇలా అస్త్రసన్యాసం చేయడం నీకు ఉచితమైనది కాదు.

కర్తవ్యాన్ని కాలం ఎప్పుడూ ప్రబోధిస్తూనే ఉంటుంది. కర్తవ్యనిర్వహణకు మించిన ధర్మం గాని, యోగం గాని లేదు.

నరుడు నిమిత్తమాత్రుడు, నడిపించేవాడు నారాయణుడు. నరుడూ, నారాయణుడూ ఒకటే!

అధర్మాన్ని ఎదుర్కొని న్యాయం కోసం పోరాటం సాగించి మంచికి విజయాన్ని సాధించి, చెడును నిర్మూలించడానికి నరుడు నారాయణుడి సాధనం.

ఈ విశ్వమంతా నిత్యసంఘర్షణతో పరిణామాన్ని పొందుతూ సాధురక్షణ, దుష్టశిక్షణ, ధర్మసంస్థాపన జరుగుతూ ఉంటుంది. అందుకోసమే భగవంతుడు యుగయుగమూ అవతరిస్తుంటాడు. ఆ

19. భగవద్గీత



భగవదవతారంగా నన్ను గుర్తుంచుకొని నేను చెప్పింది చెయ్యి! ఫలాన్ని నాకు వదులు! నీ విధిని నువ్వు చెయ్యి! లే! ఆయుధాలు తీసుకో! కర్మవీరుడవై స్వధర్మపాలన చెయ్యి!" అని చెపుతూ, విశ్వవిరాట్ స్వరూపాన్ని చూపించాడు.

సృష్టి, స్థితి, లయాలు చక్రభ్రమణంగా చంపేది, చచ్చేది, కర్త కర్మ క్రియలు ఒకటిగా కనిపించాయి. కాలం విరాట్ స్వరూపుడైన భగవంతుడి ఉనికిగా అర్థమైంది.

అర్జునుడికి సందేహనివృత్తి అయి విచారం తొలగింది. కృష్ణుడు నన్ను నడిపిస్తున్నాడు అని తప్ప వేరు భావన లేకుండా గాండీవాన్ని ఎత్తి తూణీరాల్ని ధరించి బాణం తీశాడు.

మహాసంగ్రామం జరిగింది. పాండవులు గెలిచారు. నాడు రాయబారంలో కృష్ణుడు పలికినదంతా నిజమైంది. భీముడి ప్రతిజ్ఞలు తీరాయి. ద్రౌపది కొప్పుముడి వేసుకొంది.

అభిమన్యుడిగా కాలనేమి వీరస్వర్గం అలంకరించాడు.

కర్ణుడి సహస్రకవచుడి అంశ శివుణ్ణి చేరింది. నరనారాయణులు కృష్ణార్జునులైన పని నెరవేరింది.

కృష్ణుడిగా అవతరించి భూభారం తగ్గిస్తానని భూదేవికి విష్ణువు మాటిచ్చినట్టే జరిగింది.

అశ్వత్థామ అపాండవం చేయాలని విడిచిన అస్త్రప్రభావం వల్ల ఉత్తర ఊపిరి లేని పిల్లవాణ్ణి ప్రసవించింది. కృష్ణుడు తన పాదంతో శిశువును నొక్కి పరీక్షించి శ్వాస ఆడించాడు. పరీక్షితుడు అనే పేరున అతడు పాండవ వంశాంకురంగా దక్కాడు.

ధృతరాష్ట్రుడు భీముణ్ణి శ్లాఘిస్తూ కౌగలించుకుంటానన్నాడు. కృష్ణుడు భీముడికి బదులుగా ఉక్కు విగ్రహాన్ని పెట్టించాడు. ధృతరాష్ట్రుడి గాఢాలింగనంలో అది ముక్కముక్కలైపోయింది.



గాంధారి కృష్ణుడితో, "కౌరవుల్లాగే, నీ యాదవకులం అంతరిస్తుంది!" అని పుత్రశోకంతో శపిస్తున్నట్టుగా అన్నది.

కృష్ణుడు నవ్వి, "గాంధారీ మహా సాధ్వీ! అలాగే జరుగుతుంది. విధినిర్ణయం ముందుగా నీ నోట వచ్చింది, అంతే!" అన్నాడు.

పాండవులకూ, ద్రౌపదికీ పుట్టినకుమారులైన ఉపపాండవు లైదుగుర్నీ నిద్రిస్తున్న వారిని నరికి చంపిన అశ్వత్థామను కృష్ణార్జునులు రథానికి కట్టి తెచ్చి ద్రౌపది ముందు పెట్టారు.

"హేయమైన బతుకు బతుకుతూ ఉండు! నీ కదే శిక్ష!" అని ద్రౌపది అన్నది.

అశ్వత్థామ శిరోమణిని ఊడలాగించి వదిలిపెట్టించాడు కృష్ణుడు. శిరోమణి పోగానే అశ్వత్థామ మహారోగగ్రస్తుడై ఎవరికీ కనపడకుండా. ఎటో పోయాడు.

అంపశయ్యపై ఉత్తరాయణానికి నిరీక్షిస్తున్న భీష్ముడు ధర్మరాజుకు రాజ ధర్మాలను, ధర్మసూక్ష్మాలను వివరించి, కృష్ణుడిని అనేక విధాలుగా స్తుతించి ఉత్తరాయణకాలం రాగానే ఇచ్ఛామరణంగా పరమపదించి వసువులను చేరుకున్నాడు. భీష్ముడు దివంగతుడైన ఏకాదశి భీష్మ ఏకాదశిగా పేరుపొందింది.

ధర్మరాజుకు పట్టాభిషేకం జరిగింది. కృష్ణుడు హస్తినాపురం నుంచి ద్వారకకు పయనమయ్యాడు.

ధర్మరాజు అశ్వమేధయాగ సన్నాహాలు ప్రారంభించాడు.

అక్కడ ద్వారకలో యాదవులు అదుపాజ్ఞలులేని పామరత్వంతో ఎవరికివారే నాయకులయ్యారు.

భారతయుద్ధం ప్రారంభం కాకముందే బలరాముడు తీర్థయాత్రలకని ద్వారకను విడిచి వెళ్ళాడు.

కృష్ణుడూ, యాదవ వీరప్రముఖులూ కురుక్షేత్ర యుద్ధరంగంలో ఉండగా, కృష్ణుడంతటి వాడు మావాడు అనే



అతిశయంతో ద్వారకలోని యాదవులు వెర్రితలలు వేశారు.

సాంబుడికి గర్భవతి వేషం వేయించి, ''ఈ బొట్టెకు కొడుకు పుడతాడు!'' అని ఒకడంటే, మరొకడు ''ఆడపడుచు పుడుతుందిరా!'' అని అంటూంటే, ''కొడుకే పుడతాడు!'' ''కూతురే పుడుతుంది!'' అని అంతా గోలచేస్తూ ఆ దారినే వస్తూన్న విశ్వామిత్రుడు, కణ్వుడు మొదలైన మహర్షులకు అడ్డు నిలిచి, ''స్వాములూ! ఈ అమ్మికి ఏం బిడ్డ పుడుతుందో సెలవీయండి!'' అన్నారు.

మహర్షులకు కోపం వచ్చింది. ''మందమతుల్లారా, వెర్రి యాదవుల్లారా! మీ యాదవుల్ని నిర్మూలించే ముసలం పుడుతుంది!'' అని, వారిదారిని వారు వెళ్ళారు.

ఆ మాటలకు యాదవులు నిర్లక్ష్యంగా వికవికా పకపకా నవ్వుతూ మరింత హేళన చేశారు.

తర్వాత సాంబుడి వేషం విప్పేసరికి వజ్రతుల్యమైన చిన్న రోకలి వంటి ముసలం ఖంగున పడ్డది.

యాదవులు తెల్లముఖాలు వేశారు. దిగులుపట్టుకుంది.

కృష్ణుడు ద్వారకకు రాగానే జరిగిందంతా చెప్పి ముసలాన్ని చూపించారు.

కృష్ణుడు ఆ ముసలాన్ని చూర్ణంగా అరగదీసి రూపుమాపమన్నాడు.

యాదవులు సముద్రతీరాన ముసలాన్ని అరగదీసి, అరగదీసి చివరకు మిగిలిన చిన్న ముక్కను సముద్రంలోకి విసరివేశారు. దాన్ని ఒక చేప మింగింది. చేపను ఒక వేటగాడు పట్టాడు. చేపను కోయగా కనిపించిన మొనదేరిన ముసలం ముక్కను తీసి బాణానికి తగిలించాడు.

ముసలాన్ని అరగదీసిన చూర్ణం కొన్నాళ్ళకు ఇసుకదిబ్బలపై వాడికత్తుల వంటి రెల్లుగడ్డిగా మొలిచి పొదవుగా లేచింది.

ఒకనాడు ద్వారకలోని యాదవులందరూ సముద్రతీరం చేరి విలాస

వినోదాలతో తప్పతాగి ఒకరినొకరు ఎత్తిపొడుపులతో, దూషణలతో మూకఉమ్మడిగా కలహించారు. యాదవవీరులం, వీరత్వమే మా సొమ్ము—అంటూ కైపెక్కి వాగుతూ ఎందుకు నరకాలో తెలీకుండా ఆవేశప్రధానులై, రెల్లుపొదలు పెరికి ఎవరు ఎవరో గుర్తులేకుండా ఒకరినొకరు నరుక్కొని, ఒక్కరు మిగలకుండా అంతా చచ్చారు.

సముద్రతీర జలాలు యాదవుల రక్తంతో ఎర్రబారి పోయాయి.



కృష్ణావతార తత్వాన్ని గ్రహించి, పరమ పురుషుడైన నారాయణుడే కృష్ణుడని ఎరిగి, సంసారబంధంలో పడకుండా భాగవతోత్తముడై సౌమ్యజీవనం గడుపుతున్న కృష్ణుడి తమ్ములందరిలో పిన్నవాడైన ఉద్ధవుడు మాత్రం మిగిలాడు.

బలరాముడు జరిగిన దారుణానికి వగచి విరక్తుడై అరణ్యంపట్టి, యోగ మార్గంగా శరీరాన్ని విడిచి శేషుడై వైకుంఠాన్ని చేరాడు.

ద్వారకానగరంలోని స్త్రీ బాల వృద్ధులందర్నీ తరలించుకు వెళ్ళమని కృష్ణుడు అర్జునుడికి కబురు పంపాడు. ఏడు రోజుల్లో సముద్రుడిచ్చిన చోటును తిరిగి అప్పగించవలసి ఉన్నది. సముద్రుడు ద్వారకను ఆక్రమించుకుంటాడు.

కృష్ణుడు ఉద్ధవుడికి అనేక పరమార్థాలూ, విశ్వప్రకృతితత్వాన్నీ, వేదాంత విషయాలనూ ఉపదేశించి తన విష్ణు స్వరూపాన్ని చూపి, తన అనంతరం ఉద్ధవుడు చేయవలసినది చెప్పాడు.

యాదవుల అంతంతో కృష్ణుడు అవతరించిన పని పూర్తి అయింది. భూభారం పూర్తిగా తగ్గింది.

కృష్ణుడు బయలుదేరి యమునా తీరంలోని వనం చేరి, దివ్యమైన మురళీగానం చేశాడు. మురళీస్వరాలు పలికే హిందోళ, యమునా కళ్యాణి, దేవగాంధార రాగాలతో ప్రకృతి పరవశించింది. యమున గంభీరంగా నిలిచింది.



తరువాత కృష్ణుడు ఒక చెట్టుచాటుగా అనుకొని కాలిపై కాలు ఉంచి పాదాన్ని ఆడిస్తూ విశ్రమించాడు.

ముసలపు మొన బాణానికి తగిలించిన వేటగాడు ఆవలి ఒడ్డునుంచి, చెట్టుచాటున ఆడుతూన్న కృష్ణుడి పాదాన్ని ఏదో లేడి అని తలచి విల్లెక్కుపెట్టి ముసలపు మొన బాణాన్ని గురిచూసి దాని మీదకు వేగంగా వదిలాడు.

కృష్ణుని పాదానికి ముసలపు మొన లోతుగా నాటుకొని రక్తం బొటబొటా కారింది.

దుర్వాసు డొకప్పుడు పాయసాన్ని తన వంటినిండా పూయమని కృష్ణుడిని ఆదేశించాడు. దుర్వాసుడి శరీరానికంతకూ పాయసాన్ని పూసి, కృష్ణుడు పాదానికి పూయడం మరిచాడు.

దుర్వాసుడు, "కృష్ణా! పాదం నుండి మాత్రమే నీకు హాని జరుగుతుంది సుమా!" అని చెప్పాడు.

వేటగాడు తాను కొట్టినదాన్ని ఎత్తుకుపోయేందుకువచ్చాడు. గాయంతో ఆయాసపడుతున్న కృష్ణుణ్ణి చూసి వలవలా ఏడుస్తూంటే కృష్ణుడు, "నాయనా! నువ్వు చింతించకు! రామావతారంలో నువ్వు అంగదుడివి. నీ తండ్రి వాలిని నేను చెట్టుచాటు నుండి కొట్టిన దానికి పరిహారంగా ఇప్పుడు దెబ్బతిన్నాను. కర్మానుబంధం తప్పరానిది!" అని చెప్పి రాముడుగా కనిపించాడు.

వేటగాడికి పూర్వస్మృతి కలిగి భక్తితో కన్నులుమూసి అలాగే మైమరిచి రాముణ్ణి తలుస్తూ శరీరాన్ని విడిచి విష్ణుసాయుజ్యాన్ని పొందాడు.

కృష్ణుని సారథి దారుకుడు వెతుక్కుంటూ వచ్చి ఆయాసపడుతున్న కృష్ణుణ్ణి చూసి బావురుమన్నాడు. కృష్ణుడు దారుకుణ్ణి ఓదార్చి, "ద్వారకకు వెళ్ళి అందరికీ ద్వారకను విడిచిపెట్టమని చెప్పు. ఉద్ధవుడికీ, అక్రూరుడికీ నా అనుగ్రహాశీర్వాదాలు చెప్పు, అర్జునుడికీ చెప్పు.

అతడికి మనవాళ్ళందర్నీ తరిలించుకు వెళ్ళమని తెలియచెయ్యి. శీఘ్రంగా వెళ్ళు!" అని ఆజ్ఞాపించాడు.

దారుకుడు వెళ్ళలేక వెళ్ళలేక, కన్నీరు కారుస్తూ నడిచాడు.

కృష్ణుడు మురళితీసి ఆనందంగా మధురాతిమధురంగా వాయించాడు. అది రాగం కాని రాగం, మధురాతి మధుర రాగం, మధురాతిమధురం. మురళీనాదం ప్రణవనాదం ధ్వనించింది.

కృష్ణుడు లీలామానుష విగ్రహాన్ని విడిచి విష్ణువుగా శేషతల్పాన్ని చేరుకున్నాడు.

యమునానదికి దుఃఖం పొంగిపొర్లుకు వచ్చింది. దాపునవున్న ఆ వనమంతా జలంతో నిండిపోయింది. నిర్యాణం పొందిన కృష్ణుడిని యమున తనలో దాచుకుంది.

కృష్ణుడు నిర్యాణం చెందిన మరుక్షణంలోనే కలియుగం ప్రవేశించింది, కలిప్రభావం ప్రారంభమైంది.

ఉద్ధవుడు కృష్ణతత్వాన్ని, భక్తిని ప్రబోధం చేశాడు. కృష్ణుడు ఉద్ధవుడికి ఉపదేశించిన విషయాలన్నీ భగవద్గీతలో చేరాయి.

కృష్ణుడు లీలామానుషమూర్తి. తనలోని విష్ణుదైవాంశను ఎరిగి, అవతరించిన ప్రయోజనం నెరవేరడానికి ఎటువంటి మార్గాలు అవసరమో తెలిసిన సర్వజ్ఞుడు, కార్యవాది. ఆదర్శాలకంటే దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరిగే కార్యాచరణ, ముఖ్యంగా రాజ్యతంత్రం నెరపిన అవతారమూర్తి. లీలామాత్రంగా మనుష్యుడిగా కనిపించడమే తప్ప, మానవ సహజమైన కోరికలకు అనుబంధాలకు అంటకుండా రాగద్వేషాలకు అతీతుడై, తన్నుతాను ఎరిగినవాడు గనకనే, లీలామానుష విగ్రహుడనిపించుకున్నాడు.

కృష్ణావతార మహాఫలంగా భగవద్గీత చిరస్థాయిగా, గొప్ప ప్రమాణగ్రంథంగా నిలిచింది—అని సూతుడు కృష్ణావతార చరిత్ర ముగించాడు.





# సుల్తాను హెచ్చరిక

బస్రానగరం సుల్తాను భవనంలో పెద్ద దొంగతనం జరిగింది. అనేక విలువైన వస్తువులతోపాటు, సుల్తాను ఎంతో అమూల్యంగా చూసుకునే వజ్రాలు తాపిన పిడిగల కత్తి కూడా పోయింది.

సుల్తాను నగరంలోని ముఖ్య రక్షక భటాధికారులందరినీ పిలిపించి, సంగతి చెప్పాడు.

వాళ్లు దొంగను ఒకటి, రెండు గంటల్లో పట్టుకు రాగలమన్నారు.

సుల్తాను అధికారుల కేసి కళ్ళెర్రచేసి, ''ఒక్కొక్కసారి దొంగలను పట్టడంలో మీరు అవలంబించే డొంకతిరుగుడు పద్ధతులు, నాకు తెలుసు! ఎవడో దేశదిమ్మరి వెధవనో, నోరూవాయీ లేని బిచ్చగాణ్ణో పట్టుకుని, వీడే దొంగ అని మాత్రం, నా దగ్గిరకు తీసుకురాకండి. దొంగతోపాటు, వాడు భవనంలో దొంగిలించుకుపోయిన నా అమూల్యమైన కత్తితో సహా అన్ని వస్తువులూ తీసుకురావాలి. ఇందుకు మీకు రేపు సాయంత్రం వరకూ గడువు యిస్తున్నాను. కార్యం సానుకూలం కాక పోయిందో, మీ అందర్నీ ఉద్యోగాల్లోంచి తీసివేస్తాను,'' అన్నాడు.

ఈ హెచ్చరికతో ఉద్యోగస్థు లందరికీ దొంగను పట్టలేకపోతే ఉద్యోగాలు పోగల వన్న భయం కలిగింది. దానితో వాళ్ళకు ఎలా అయినాసరే దొంగను పట్టాలన్న పట్టుదల వచ్చింది.

వాళ్ళందరూ సంప్రతించుకుని, రకరకాల వేషాలు వేసుకున్నారు. ఒక్కొక్కడూ నగరంలోని ఒక ప్రాంతానికి పోయి, దొంగ ఆచూకీకోసం ప్రయత్నించి, సాయంకాలానికి నగరం దక్షిణదిక్కున వున్న ఒక పానశాల వద్ద కలుసుకోవాలను కున్నారు.

అరేబియా కథ

వాళ్ళల్లో ఒక ఉద్యోగి, బిచ్చగాడి వేషం వేసుకున్నాడు. అతను నగరంలోని ఉత్తరభాగంలో, మిట్టమధ్యాహ్నం వరకూ ఎక్కడా ఆగకుండా తిరిగి, బాగా అలిసిపోయి దాహం తీర్చుకునేందుకు నీటి కోసం చూస్తూండగా, ఒక చిన్న ఉద్యానవనం కనిపించింది. అక్కడ ఒక చెట్టు నీడలో మంచినీటి కొలను ఒకటున్నది.

ఉద్యోగి కొలను దగ్గిరకుపోయి, నీరు తాగబోయేంతలో ఉద్యానం కాపలావాడు అతణ్ణి చూశాడు. వెంటనే వాడు పరిగెత్తుకుంటూ వచ్చి, ఉద్యోగి మెడపట్టుకుని, "ఒరే, అడుక్కుతినే వెధవా! ఇక్కడికి ఎవరి అనుమతి మీద వచ్చావు? నీవు పెద్ద దొంగవు, అవునా?" అంటూ పిడికిళ్ళతో అతడి వీపు మీదా, తల మీదా బాదసాగాడు.

మారువేషంలో వుండడంతో రక్షకభటాధికారి పెద్ద చిక్కులో పడిపోయాడు. అతను బాధతో మూలుగుతూ, "అయ్యా, కొట్టకండి. నేను దొంగను కాదు. ఈ మిట్ట మధ్యాహ్నంవేళ దాహమై ప్రాణం కడబట్టుతుంటే, నీళ్లు తాగేందుకు యిక్కడికొచ్చాను," అన్నాడు.

"అలాగా! ఇది నీకు తగిన శిక్ష," అంటూ కాపలావాడు, యీసారి కాళ్ళతో తన్నసాగాడు.

అధికారి పెద్దగా గొంతెత్తి, "అయ్యా, కాస్త శాంతపడండి. మీ దెబ్బలతో నా ప్రాణం పోయేట్టుంది. నన్ను చంపే



హక్కు మీకెక్కడిది? అంత దొంగననుకుంటే నన్ను రక్షకభటులకు అప్పగించండి," అన్నాడు.

"అహ్హాహ్హా! నాకు చట్టం, శాసనం, మంచీ, మర్యాదా నేర్ప చూస్తున్నావన్న మాట!" అంటూ కాపలావాడు ఉద్యోగిని ఉద్యానం నుంచి బయిటికి లాక్కు వచ్చి కింద పడవేసి, ఉత్సాహంగా ఈల వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

రక్షక భటోద్యోగి కొన ఊపిరితో కాళ్ళీడ్చుకుంటూపోయి, పానశాల దగ్గిర మిగతావాళ్లను కలుసుకున్నాడు. జుట్టంతా రేగిపోయి, చిరిగినబట్టలతో వచ్చిన అతణ్ణి చూసి, ఉద్యోగులందరూ ఆశ్చర్యపోయారు.

దెబ్బలుతిన్న ఉద్యోగి జరిగినదంతా వాళ్ళకు చెప్పాడు. అందరూ పట్టరాని కోపంతో దొంగ సంగతి వదిలి ముందు, కాపలావాడికి తగిన శాస్తి చెయ్యాలనుకున్నారు.

వాళ్ళు త్వరగా భోజనం ముగించి మారు వేషాలు తీసివేసి, రక్షకభటుల దుస్తులు ధరించి ఉద్యానవనం దగ్గిరకు వెళ్ళారు.

వాళ్ళు సరాసరి ఉద్యానంలో ప్రవేశించకుండా, చెట్లచాటుగా లోపలికి తొంగి చూశారు.

కాపలావాడు ఒక పదేళ్ళ కుర్ర వాడితో ఉత్సాహంగా మాట్లాడుతున్నాడు. రక్షక భటోద్యోగులు చడీచప్పుడూ కాకుండా



వెనకనుంచి వాళ్ళను సమీపించారు. ఉద్యోగుల్లో ఒకడు ఎగిరి ఒక చేత్తో కాపలా వాడి మెడ పట్టుకుని, రెండవ చేత్తో వాణ్ణి డొక్కలో పొడవసాగాడు.

దెబ్బలు భరించలేక కాపలావాడు అరవడం మొదలుపెట్టాడు. వాడివల్ల హింసలపాలైన ఉద్యోగి పళ్ళుకొరుకుతూ, "ఒరే, పశువా! దొంగా!" అంటూ గట్టిగా ఒక్క తన్ను తన్నాడు.

ఒక్కసారిగా ఇంతమంది రక్షక భటోద్యోగుల్ని చూసి, హడలిపోతున్న కుర్రవాడు వెంటనే, "అయ్యలారా, మా మామయ్యను కొట్టకండి. కావాలంటే ఆయన దొంగిలించి తెచ్చిన వస్తువులు ఎక్కడ దాచిందీ మీకు నేను చూపుతాను," అన్నాడు.

"ఎక్కడ దాచాడు?" అన్నారు ఉద్యోగులంతా తమ ఆశ్చర్యాన్ని బయట పడనీయకుండా.

భయంతో వణికిపోతూ కుర్రవాడు వాళ్ళను ఉద్యానంలో ఒక మూల గుబురుగా పెరిగిన పూలమొక్కల దగ్గరకు తీసుకుపోయాడు.

అక్కడ తవ్వగా వాళ్ళకు తాము వెతుకుతున్న సుల్తానుగారి పోయిన వస్తువులన్నీ కంటబడినై!

వాళ్ళకు పట్టరానంత ఆనందం కలిగి గంతులు వేయాలనిపించింది. బిచ్చగాడి వేషంలో కాపలావాడిచేత చావుదెబ్బలు తిన్న ఉద్యోగి వాడితో, "ఒరే, నిన్నేదో పిశాచి ఆవహించి, నీ చేత సుల్తానుగారి భవనంలో దొంగతనం చేయించింది. అది దాని సరదా! కాని, అదే పిశాచం నీకు కీడు చేయతలపెట్టి, నీ చేత దాహంకోసం వచ్చిన ఒక బిచ్చగాణ్ణి చావుదెబ్బలు కొట్టించింది. ఒళ్ళు హూనమైతేనేం గాని, అందువల్లనే, నీ దొంగతనం బయట పడింది," అన్నాడు.

ఆ మాటలతో కాపలావాడికి, అంతకు ముందు తన చేత దెబ్బలు తిన్నవాడు బిచ్చగాడు కాదనీ, ఆ వేషంలో వున్న రక్షక భటోద్యోగి అనీ అర్థమైంది.



# తెలియని సంగతులు

రాచకొండ జమీందారు చాలా ఉదారస్వభావుడు. వ్యాపారనిమిత్తం పెట్టుబడి కావాలని వచ్చే వారికి సహాయం చేస్తూండేవాడు. కాని, అలా వచ్చినవారి తెలివితేటల్ని పరీక్షించకుండా మాత్రం డబ్బు యిచ్చేవాడు కాదు.

ఒక రోజు ఆయన దగ్గిరకు, కోడిగుడ్ల వ్యాపారం చేసేందుకు పెట్టుబడి డబ్బు కావాలంటూ కొండయ్యా, గోపయ్యా అనే అమాయకు లిద్దరు వచ్చారు. జమీందారు, వాళ్ళకు ఆ వ్యాపారాన్ని గురించి ఏ మాత్రం తెలుసో కనుక్కొనేందుకు, "కోడిగుడ్లను గురించి మీకు తెలియని సంగతులేమైనా వున్నయ్యా?" అని అడిగాడు.

దానికి కొండయ్య, "గుడ్డును పగలగొట్టుకుని బయిటికి వచ్చేవరకూ కోడిపిల్ల, గాలీ వెలుతురూ లేని, ఆ చీకటి ఖైదులో ఎలా వుండ గలుగుతున్నదో, నాకు తెలియదు!" అన్నాడు.

గోపయ్య ఒకటి, రెండు క్షణాలు తలాడిస్తూ వూరుకుని, "అవును, అది ఆశ్చర్యం కలిగించే సంగతే! కాని, అంతకన్న ఆశ్చర్యం ఏమంటే—కోడిపిల్ల బయిటికి రావడానికి గుడ్డు పెంకును పగలకొట్టవలసి వస్తుంది కదా! అయితే, అదే కోడిపిల్ల, గుడ్డు లోపలికి వెళ్ళినప్పుడు, దాని పెంకును పగలకొట్టకుండా, ఎలా వెళ్ళగలిగింది? ఈ సంగతి .ఎంత బుర్రబద్దలుకొట్టుకున్నా, నాకు తెలియడం లేదు!" అన్నాడు.

జమీందారు వాళ్ళ జవాబుకు నవ్వుకుని, "మీరు కోడిగుడ్ల వ్యాపారస్థులుగా రాణించలేరు. మరేదైనా తెలిసిన వ్యాపారం వున్నదేమో ఆలోచించుకుని రండి," అని ఇద్దర్నీ పంపేశాడు.

—సుంకర భాస్కరరావు



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. G. Seshagiri



V. Muthuraman

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎక్కడికి స్వామీ, మీ పయనం? రెండవ ఫోటో: బ్రతుకు వేటయేగా, గమ్యం!

పంపినవారు: యస్. శ్రీనివాసరావు, ఖమ్మం–507003 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. సెయింట్ థామస్ 2. జైనమతం 3. నలంద 4. జెండ్ అవెస్తా 5. సిసిరో

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, . Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# ఉచితం!
## వన్య జీవన స్టికర్లు
## ఫోర్‌హాన్స్
## ఫ్లోరైడ్ టూత్ పేస్టుతో

4 స్టికర్లు 200 గ్రా. ప్యాక్‌తో
3 స్టికర్లు 150 గ్రా. ప్యాక్‌తో
2 స్టికర్లు 100 గ్రా. ప్యాక్‌తో
1 స్టికర్ 50 గ్రా. ప్యాక్‌తో




వన్య జీవన వైభవం.... 15 వివిధ స్టికర్లలో.
వర్ణమయం. ఆకర్షణీయం. ఉత్తేజకరం.
నేడే జమ చేయడం ప్రారంభించండి!

*త్వరపడండి! సరుకు వున్నంత వరకే ఈ అవకాశం*

Pic. E. Hanumantha Rao.
Courtesy: World Wildlife Fund-India Photo Library.

351 F-183 TEL